# నీతి కథామాల

## (మన వారసత్వం)

సంకలనం

**జి.ఎస్. రామశాస్త్రి**



ప్రచురణ

**తిరుమల తిరుపతి దేవస్థానములు**

**తిరుపతి**

# NEETI KATHAMALA

**(Manavarsatvam)**

by

**G.S. Rama Sastry**



T.T.D Religious Publications Series No : 249

First Edition : 2003
Re-Print : 2008
Copies : 5,000

Published by:
**Sri K.V.Ramanachary, IAS**
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati - 517 507

Printed at
Nageswara Binding Works, Kovvur-534350
On behalf of T.T.D.

# ముందుమాట

దైవసృష్టిలో జీవరాసులన్నింటిలోనూ మానవజన్మ విశిష్టమైనదిగా ఎన్నబడింది. పశుపక్ష్యాదులైన ప్రాణులకు మానవుడికి ఆకలిదప్పులు, నిద్ర వంటి శారీరక లక్షణాలు సమానధర్మాలు. అయినా ఆలోచన, నడవడిక ధర్మాచరణ వంటి ప్రత్యేక నియమాలు మానవుణ్ణి మిగతావాటికంటె ఉన్నతస్థానంలో నిలబెడుతున్నది. అంతేకాదు. ఆ నీతి నియమాచరణలతో మాములు మనిషి మనీషిగా విలసిల్లుతున్నాడు కూడ!

'ధర్మో రక్షతి రక్షితః' అని ఆర్ష సూక్తి. ఎవరైతే ధర్మాన్ని ఆచరిస్తూ, ఆ విధంగా ధర్మాన్ని రక్షిస్తారో, వారిని ఆ ధర్మమే సర్వదా రక్షిస్తూ వుంటుందని భావం. అయితే ఏది ధర్మం? ఏది అధర్మం? ఏ సమయంలో ఎలా మెలగాలి? అన్న సందేహపరంపరలు కోకొల్లలు. మనవేదాలు, ఉపనిషత్తులు, శాస్త్రాలు, పురాణాలు, ఇతిహాసాలు మొదలైనవి, ఆ యా సందర్భాల్లో సొంపైన సూక్తుల ద్వారా, కమనీయమైన కథల ద్వారా ఆ సందేహాలను నివృత్తిచేసి, తద్వారా సన్మార్గోపదేశం చేస్తూ మనిషిని మహా మనీషిగా తీర్చిదిద్దుతున్నాయి.

''మొక్కై వంగనిది మానై వంగదు'' అనే నానుడి ననుసరించి బాలబాలికలకు బాల్యంలోనే ధర్మాచరణను గూర్చి ఉపదేశిస్తే బాగా వంట బట్టి, వారు మంచి మార్గంలో నడవడమేగాక, ఎందరికో మార్గదర్శకులవుతారు.

కాంచీ కామకోటి పీఠాధిపతులయిన శ్రీశ్రీశ్రీ జయేంద్ర సరస్వతి స్వామివారి ఆదేశం మేరకు, శ్రీ జి.ఎస్. రామశాస్త్రిగారు భావిపౌరులను దృష్టిలో ఉంచుకొని ఆకర్షణీయమైన నీతికథలతో అందరికీ సులభంగా అర్థమయ్యే రీతిలో ఈ పుస్తకాన్ని ఇంపుగా రూపొందించారు.

సార్థక నామధేయమైన ఈ "నీతికథామాల"ను పాఠకలోకానికి అందించాలనే ఉదాత్త సంకల్పంతో, తిరుమల తిరుపతి దేవస్థానం వారు, ధార్మిక ప్రచురణగా ముద్రించారు. మళ్ళీ పునర్ముద్రితమౌతున్న ఈ పుస్తకం ఆబాల గోపాలాన్ని అలరించగలదని ఆశిస్తున్నాము.

తిరుపతి. కార్యనిర్వహణాధికారి,

తేది. తి.తి. దేవస్థానములు

# పరిచయం

పరమేశ్వర సృష్టిలో అతి విలువైనది ధన, కనక వస్తు వాహనాదులు కాదు. మానవుడే అతి విలువైన వస్తువు. మానవునందు విలువైనది మనస్సు. ''మన యేవ మనుష్యాణాం కారణం బంధ మోక్షణం'' అన్నట్లు మానవుని సద్గతికి దుర్గతికి ప్రధాన హేతువు మనస్సే. అట్టి మనస్సు వివిధ సంస్కారములవలన, పరిశుద్ధమై నిర్మలమై మానవునిలోని దానవత్వాన్ని జయించి మానవత్వాన్ని, మానవత్వాన్ని అధిగమించి దైవత్వాన్ని పొందుతుంది. అది పరిపూర్ణ స్థితి. ఈ వివిధ సంస్కారములు మనస్సుకు విద్యవలన ప్రాప్తిస్తాయి. దానికి గృహమందు, పాఠశాల యందు గల వాతావరణము ప్రోది చేస్తుంది. అందువలన కేవలం అక్షరాస్యత విద్య కాదు. జీవిత పరమార్థాన్ని తెల్పేది, దానికి అవసరమగు మార్గాన్ని నిర్దేశించేది విద్యగా మనం అర్థం చేసుకోవాలి. అందువలననే వ్యక్తియొక్క వైయుక్తిక జీవితాన్ని రూపుదిద్దే ''నీతి'' సర్వమత సమాదరణీయము, సార్వకాలికమైనది. నేటి విద్యావిధానము యొక్క గుణ దోషాల ప్రసక్తి అటుంచి, ఈ సార్వకాలికమైన, సార్వజనీనమైన నీతి సూత్రాలను ప్రభోదించి నేటి సమాజ జీవనంలోని అన్ని రంగాలలో లుప్తమైపోతున్న నీతిని, మానవత్వపు విలువలను, నేటి మన విద్యార్థులకు వివరించవలసిన అవసరం ఎంతగానో మనకు కన్పడుతోంది. ఇది సర్వులూ అంగీకరించిన విషయమే.

శ్రీ కంచి కామకోటి పీఠాధీశ్వరులు, జగద్గురు శంకరాచార్య శ్రీశ్రీశ్రీ జయేంద్ర సరస్వతీ స్వామివారు సమాజ శ్రేయస్సు, భావితరాల శ్రేయస్సును భావిస్తూ నీతి బోధకమైన, ధర్మమార్గ నిర్దేశకమైన కథలను విద్యార్థులకు బోధించుటకు గాను సమీకరించి గ్రంథరూపంలో అందజేయుమని ఆదేశించారు. శ్రీవారి ఆదేశాన్ని శిరసావహించి వారి ఆశీర్వలంతో ఈ ప్రయత్నం చేశాను. ఇందు జారిన దొసగులను సహృదయులు మన్నిస్తారని ఆశిస్తాను.

ఋషిప్రోక్తమైన మన ఆర్ష సంప్రదాయంలో యుగయుగాలుగా తరతరాల వారికి అందజేయబడిన ఈ జీవితపు విలువలే మనకు దత్తం చేయబడిన వారసత్వం. అది విలక్షణమైనది. అట్టి మన వారసత్వమును ప్రతిపాదించే నీతి కథామాల ఇది. ఈ పుస్తకం విద్యార్థుల ప్రయోజనార్థం ఉద్దేశించబడినది.

ఈ కృషి లోని శ్రమను నాతో పాలుపంచుకొన్న శాతవాహన కళాశాల ఆంధ్ర శాఖాధ్యక్షులు శ్రీ జంధ్యాల మహతీశంకరుగారికి హృదయపూర్వక ధన్యవాదములు.

జి.ఎస్. రామశాస్త్రి

## విషయసూచిక

★★★★

## దైవస్తుతి

శుక్లాం బర ధరం విష్ణుం
శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్న వదనం ధ్యాయేత్
సర్వ విఘ్నోప శాంతయే.

## భాస్కరా!

శ్రీ గల భాగ్యశాలిఁ గడుఁ జేరఁగవత్తురు తారుదారె దూ
రాగమన ప్రయాసమున కాదట, నోర్చియునైన నిల్వ ను
ద్యోగము చేసి; రత్న నిలయుండని కాదె సమస్త వాహినుల్
సాగరుఁ జేరుటెల్ల - మునిసన్నుత మద్గురుమూర్తి భాస్కరా!

భావము : లోకము నందలి జను లెల్లరును భాగ్యవంతు డెక్కడ నుండిన అక్కడకు ఎంత శ్రమ నోర్చియైనను తమంతట తామే వచ్చెదరు. సముద్రుడు రత్నములకు నిలయమైనవాడు కావుననే నదులన్నియు వానిని జేరుచున్నవి.

★★★★

# మాండవ్యుడు

మాండవ్యుడు ఒక బ్రాహ్మణ తపస్వి. సత్య, ధర్మములను అయన బహునిష్ఠతో ఆచరించేవాడు. మౌన వ్రతంతో అయన తన ఆశ్రమ సమీపంలో గల ఒక చెట్టు నీడన శీర్షాసనంతో తపస్సు ప్రారంభించాడు. అట్లా కొన్ని సంవత్సరాలు నిశ్చలంగా ఘోర తపస్సు చేశాడు. తపస్సు చేస్తున్న కాలంలో ఒకనాడు కొందరు దొంగలు ఆ ఆశ్రమ ప్రాంతానికి పరుగెత్తుకుంటూ వచ్చారు. రాజభటులు వారిని తరుముకుంటూ వస్తున్నారు. ఆ దొంగలకు ఏమి చేయటానికి తోచలేదు. వారి వద్ద నున్న దొంగిలింపబడిన వస్తువుల భారంతో వేగంగా పారిపోలేక ఆ వస్తువులను మాండవ్యుని ఆశ్రమంలో దాచి పారిపోయారు. రాజభటులు తర్వాత అచ్చటకు చేరారు. దొంగలు ఆశ్రమంలో దాగి యుంటారని భావించి ఆ ఆశ్రమాన్ని వెదికారు. అక్కడ ఆ చోరులు దాచిన వస్తువులు కనిపించినవి. బయట వెదికారు. కొద్ది దూరంలో శీర్షాసనంతో తపస్సు చేస్తున్న మహర్షి కనిపించాడు. ఒక దొంగ తమను మోసం చేయడానికే ఈ విధంగా తపస్వివలె నటిస్తున్నాడని భావించారు. వెంటనే ఆ దొంగల జాడ చెప్పమని గద్దించి అడిగారు. మౌన వ్రతంలో నున్న ముని మాట్లాడలేదు.

వారు పిదప దొంగలనందరనూ బంధించి వారితో మునిని కూడ బంధించి తీసుకువెళ్ళారు. అందరినీ రాజ సమ్ముఖంలో నిలబెట్టారు. ఆ చక్రవర్తి చౌర్య నేరానికి వారందరకు మరణదండన విధించాడు. అందరితోపాటు మహర్షిని కూడా ఆ రాజభటులు ఒక శూలానికి గుచ్చారు. దొంగలందరూ మరణించారు. కాని ఆ ధర్మాత్ముడు మాత్రం ఆ శూలాగ్ర భాగంలో ఆహార పానీయాలు లేకుండా చాలా కాలం తన తపశ్శక్తివల్ల జీవించి ఉన్నాడు. అట్లే ఉంటూ మాండవ్యుడు తన తపోబలంతో ఇతర ఋషులను పిలువసాగాడు. ఆ ఋషులందరూ మాండవ్యుని పిలుపు నందుకుని పక్షి రూపాలలో రాత్రిపూట వచ్చి ఆ మహాత్మునికి కల్గిన దుస్థితికి విచారించి "మహర్షీ! ఏ కారణం చేత నీకీ దుస్థితి కల్గినది?" అని ప్రశ్నించారు. ఆ ధర్మశీలి తన ప్రారబ్ధమునకు మరొకరిపై నిందారోపణ చేయదల్చుకోలేదు. కొరత వేసినా మహర్షి మరణించకపోవడం, రాత్రిపూట పక్షులు వానితో సంభాషించడం రాజభటులకు ఆశ్చర్యం వేసింది. వారు వెంటనే చక్రవర్తికి ఈ విషయం

తెలియజేశారు. ఆ రాజు వెంటనే వచ్చి మహర్షికి క్షమార్పణ చెప్పుకుని అనుగ్రహించమని పదే పదే ప్రార్థించాడు. రాజాజ్ఞ ప్రకారం భటులు ఆయన శరీరం నుండి శూలాన్ని బయటకు లాగబోయారు. కాని వారి ప్రయత్నాలు ఫలించలేదు. అప్పుడు మాండవ్యుడే ఆ శూలాగ్ర భాగాన్ని తన శరీరంలో ఉంచుకొని మిగిలిన భాగాన్ని నరికివేశాడు. శూలాగ్ర భాగాన్ని ''అణి'' అని పిలుస్తారు. అణి శరీరమందు కలవాడు కాన ఆయన అణి మాండవ్యుడైనాడు. శరీరంలో శూలమున్నా ఆయన తపస్సుతో అనేక పుణ్యలోకాలను సంపాదించాడు.

ఒకనాడు మాండవ్యుడు యమలోకం వెళ్ళాడు. దివ్య సింహాసనంపై కూర్చుని ఉన్న యమధర్మరాజును చూచి ''యమధర్మరాజా! నాకు ఊహ తెల్సిన తర్వాత నేను ఏ పాపం చేయలేదు. అజ్ఞాన దశలో చేసిన ఏ పాపానికి నాకు కొరత వేశారో చెప్పు''మని కోరాడు. అంత యమధర్మరాజు మహర్షీ! మీరు బాల్యంలో తూనీగలను పట్టుకుని వాటికి ముళ్ళు గుచ్చి ఆటలతో ఆనందించేవారు. దాని వల్ల మీకు ఈ స్థితి కల్గిందని చెప్పాడు. చూడండి! అల్ప దానం మహా ఫలాన్నిచ్చినట్లే స్వల్ప పాపం కూడ అత్యంత కష్టాలనిస్తుంది గదా!

★★★★

**అల్పానా మపి వస్తూనాం సంహతిః కార్య సాధికా,**
**తృణైర్గుణత్వ మాపన్నైర్బధ్యన్తే మత్త దన్తినః**

★★★★

## దైవస్తుతి

నమశ్శివాభ్యాం నవయౌవనాభ్యాం
పరస్పరాశ్లిష్ట వపుర్ధరాభ్యామ్,
నగేంద్ర కన్యా వృషకేతనాభ్యాం
నమో నమశ్శంకర పార్వతీభ్యామ్.

## భాస్కరా!

అతి గుణహీన లోభికిఁ బదార్థముగల్గిన లేక యుండినన్
మితముగఁగాని కల్మిఁగల మీఁదట నైన భుజింపఁ డింపుగా
సతమని నమ్ము దేహమును సంపదఁ బేటలు నిండిపాఱినన్
గతుకఁగ జూచుఁ గుక్క తన కట్టడ మీఱక యుందు భాస్కరా!

భావము : మిక్కిలి లోభియగు వ్యక్తి ఈ దేహము, సంపదలే శాశ్వతములని భావించి, తన కెంత ఐశ్వర్యమున్నను తనకడ పదార్థములెన్ని యున్నను తక్కువగానే భుజించును. ఏఱులు నిండుగా నీరు ప్రవహించుచున్నను కుక్క గతుకుటకే తలంచును.

★★★★

# శిబి చక్రవర్తి

శిబి ఉశీనరుడను రాజుయొక్క కుమారుడు, మహాదాతగా పేరుపొందాడు. ఒకనాడు శిబి కూర్చునియుండగా ఒక పావురాన్ని తరుముకుంటూ ఒక డేగ వచ్చింది. ఆ పావురం గడ గడ వణకుతూ శిబి చక్రవర్తి సమీపానికి వచ్చి వాలింది. అప్పుడు అచటనున్న పురోహితుడు "రాజా! ఈ పావురం ప్రాణ భయంతో మీ శరణు జొచ్చినది" అని అన్నాడు. జీవికి ప్రాణంకంటె ముఖ్యమైనదికాని ప్రాణదానం కంటె గొప్పది గాని మరొకటి లేదు. ఆ సమయంలో మనుష్యవాక్కులతో ఆ పావురం – "ఓ రాజా! నేనొక ఋషిని. బ్రహ్మచర్య నియమంతో వేదాధ్యయనం సాగించి పాపరహితుడనై యోగశక్తులు సాధించినవాడను. పక్షిరూపం ధరించాను. నీవు ప్రాణ రక్షకుడిగా తలచి నిన్ను శరణువేడుతున్నాను. కాన నన్ను ఆ డేగకు దానం చేయకు" మని పల్కినది. అప్పుడు డేగ – "ఓ రాజా! నీవు దీనికి అభయమిచ్చి నా ఆహారానికి అడ్డుతగులవద్దు. నోటిదగ్గర అన్నం తీయడం నీ వంటి వానికి తగని పని" అని విన్నవించింది.

మానవ వాక్కులలో పక్షులు మాట్లాడటం శిబికి ఆశ్చర్యం కలిగించింది. ఇప్పుడు ఆయనకు విషమ పరిస్థితి ఏర్పడింది. ప్రాణభీతితో వచ్చిన శరణార్థికి అభయ మివ్వకపోతే రాజ్యంలో సకాలంలో వర్షాలు కురియవు, క్షామం ఏర్పడుతుంది. బాల్యమరణాలు సంభవిస్తాయి. రాజ్యం ఇంద్రాది దేవతల కోపానికి గురౌతుంది. ఇట్లు తలచి శిబి డేగను చూసి "ఓ పక్షిరాజా! ఈ పావురం కంటె బలమైన ఆహారాన్ని నా సేవకులు వండి నీకు సమర్పిస్తారు. నీకు మంచి ఆవాసం కూడ కల్పిస్తారు. ఈ పావురాన్ని విడువు" మన్నాడు. ఆ డేగ "రాజా! నేను పచనమైన ఆహారాన్ని ఇమ్మని కోరలేదు. పావురం కంటె నాకు రుచికరమైన ఆహారం లేదు. ఇది విధి నాకిచ్చిన ఆహారం కాన దానిని నాకు విడిచిపెట్టు" అని కోరింది. ఆ డేగను చూచి శిబి అనునయంగా "ఋషభకంద మేహత ఓషధులు చాల పుష్టికరమైనవి. వానిలో ఏది కోరినా నీకిస్తాను. కాని పావురాన్ని విడువను. శరణుకోరిన వారిని రక్షించడం క్షత్రియ ధర్మం. నా స్వధర్మాన్ని సక్రమంగా పాలించాలి, కాన నీవు మరేది కోరినా ఇస్తాను" అని అన్నాడు.

అప్పుడు ఆ డేగ- ''మహారాజా! ఈ పావురంతో సమంగా తూగే మాంసాన్ని నీ కుడి తొడనుండి కోసి ఇవ్వు. అప్పుడు నీ ధర్మమూ, నా అభీష్టమూ నెరవేరుతాయి'' అని చెప్పగా సంతోషంతో శిబి అంగీకరించాడు. వెంటనే శిబి త్రాసు తెప్పించాడు. త్రాసులో ఒకవైపు పావురాన్నుంచి తన తొడను చీల్చి మాంసం కోసి మరో వైపు వేయడం ప్రారంభించాడు. ఎంత మాంసం వేసినా పావురంతో సమంగా తూగడం లేదు. క్రమంగా అవయవాలన్నీ కోసి మాంసం కండలు కండలు త్రాసులో ఉంచాడు. అయినా పావురమే బరువుగా ఉంది. అందరి ఆశ్చర్యానికి అంతులేదు. ఇక లాభం లేదని శిబి తానే త్రాసులో కూర్చున్నాడు. పావురానికి ప్రాణరక్షణ జరిగిపోయింది అని అంటూ డేగ ఆకాశంలోనికి ఎగిరిపోయింది.

అప్పుడు శిబి పావురాన్ని చూచి నమస్కరించి - ''మహాత్మా తమరు ఎవరు? మిమ్ములను మామూలు పక్షిగా నేను తలంచను'' అని అనగా, ఆ పావురం అగ్నిదేవుని రూపంలో సాక్షాత్కరించి ''రాజా నేను అగ్నిభట్టారకుడను. ఆ డేగ వజ్రహస్తుడైన ఇంద్రుడు. మానవశ్రేష్ఠుడైన నిన్ను పరీక్షించుటకు ఈ రూపాలలో వచ్చాము'' అని పలికి అతనిని ఆశీర్వదించి అంతర్ధానమయ్యెను.

తన త్యాగంతో శిబి ఈ లోకంలో కీర్తికాయుడయ్యాడు. అంతేగాక స్వర్గంలో అతనికి శాశ్వత స్థానం లభించింది. అందువలన త్యాగేనైక అమృతత్వ మానసుః అని అన్నారు.

★ ★ ★ ★

3

## దైవస్తుతి

శ్రీ రాఘవం దశరథాత్మజ మప్రమేయం
సీతాపతిం రఘుకులాన్వయ రత్నదీపమ్,
ఆజానుబాహు మరవింద దళాయతాక్షం
రామం నిశాచర వినాశకరం నమామి.

## భాస్కరా!

ఈ జగమందుఁ దామనుజుఁ డెంత మహాత్మకుఁడైన, దైవ మా
తేజము తప్పఁ జూచునెడఁ ద్రిమ్మరి కోల్పడు, నెట్లనన్ మహా
రాజకుమారుడైన రఘురాముఁడు గాల్నడఁ గాయ లాకులున్
భోజనమై తగన్ పవికిఁబోయి చరింపడె మున్ను భాస్కరా!

భావము : ఈ లోకమునందు మనుష్యుడెంత గొప్పవాడైనను, దైవానుగ్రహము లేకున్నచో ఆ గొప్పతనమును పోగొట్టుకొని దేశసంచారియై తిరుగకతప్పదు. మహారాజ కుమారుడైన శ్రీ రామచంద్రు డంతటివాడు దైవదుర్విపాకవముచే రాజ్యమును వీడి, వనములలోబడి, కాయలు ఆకులే ఆహారముగా, సంచరింపక తప్పలేదు.

★★★★

# భరతుడు

భరతుడు దశరథుని తనయుడు, కైక కుమారుడు. భరతుడు నిష్కల్మషమైన భ్రాతృభక్తికి పెట్టింది పేరు. రాముడంటే భరతునికి అమితమైన గౌరవము. పూజ్య భావం. తన సర్వస్వమును సోదరుడైన శ్రీరామచంద్రుడికి సమర్పించిన త్యాగశీలి భరతుడు.

భరతుడు వివాహానంతరం మాతామహుని దగ్గర కేకయ దేశంలో ఉండేవాడు. శ్రీరామచంద్రుడు పితృవాక్య పరిపాలనార్థం సీతా లక్ష్మణులతో అరణ్యాలకు వెళ్ళాడు. పుత్ర వియోగ దుఃఖంతో దశరథుడు ప్రాణాలు విడిచాడు. వశిష్ఠుని ఆదేశానుసారం భరతుడు కేకయ దేశం నుండి శత్రుఘ్నునితోపాటు అయోధ్యకు వచ్చాడు.

అంతః పురంలో ప్రవేశించగానే తల్లి ఎదురుగా వచ్చి కుమారుణ్ణి ప్రేమార ఆలింగనం చేసుకున్నది. భరతుడు తల్లికి నమస్కరించి, తాతగారు పంపిన ఆభరణాలు అందించాడు. వారి క్షేమం తెలిపి "అమ్మా! రాజమార్గాలన్నీ అమంగళంగా ఉన్నవి. కారణమేమిటి? ఎందువల్ల నగరమంతా శూన్యంగా ఉన్నది? ఎక్కడా సంతోషరేఖలు కనిపించవేమిటి ? నాహృదయం ఎందుకో కలవరపాటు చెందుతున్నది " అని అడిగాడు.

కైక భరతునితో "నాయనా! నాకు దశరథ మహారాజు రెండు వరాలు ఇచ్చాడు. నీకు పట్టాభిషేకం చేయమనీ, రాముణ్ణి వనవాసానికి పంపమనీ - ఆ రెండు వరాలు కోరుకున్నాను. తండ్రి వాక్యాన్ని పాలించి రాముడు అడవులకు వెళ్ళాడు. పుత్రశోకంతో రాజు మరణించాడు. కఠినమైనదైనా నీ కోసమే ఈ రెండు వరాలు కోరుకున్నాను. ఇక పట్టాభిషిక్తుడవై రాజ్యపాలనం వహించు" అన్నది.

తల్లి మాటలు విని భరతుడు మూర్ఛపోయాడు. కొంత సేపటికి మూర్ఛనుండి తేరుకొని, కనులవెంట నిప్పులు రాలుతుండగా "ఓసీ ! రాక్షసీ ! ఎంత పాపపు పనికి ఒడిగట్టావు? రాముణ్ణి అడవికి వెళ్ళమని చెప్పడానికి నీకు నోరెట్లా వచ్చింది? శ్రీరామచంద్రుడు నారబట్టలు కట్టుకొని అడవిలో ఉండగా నేను పట్టాభిషిక్తుడనై రాజ్యభోగములు అనుభవించగలనటే ? అన్నకు నా ముఖం ఎట్లా చూపేది ? నా చిత్తవృత్తి తెలిసికూడా, నీచబుద్ధితో రాముడికి ద్రోహం చేశావు. ఆ రఘురాముని మనస్సు ఎంత క్షోభించినదో ఏమో! లక్ష్మణుడు నా మీద ఎంత కోపగిస్తున్నాడో - నీ నిమిత్తముగా ఇన్ని ఆపదలు సంభవించినవి. నీవు పాపివి.

భర్తను చంపినదానవు. శత్రుఘ్నా! ఇప్పుడు మనమీ పాపిని చంపిన, మాతృ హంతకులని శ్రీరాముడు మన ముఖములు చూడడు. రమ్ము" అని పలికి శత్రు ఘ్నునితో పాటు కౌసల్యా సుమిత్రల దగ్గరకు వెళ్ళాడు. వారి పాదాలపై బడి రోదించాడు.

కౌసల్య పుత్రులను చూచి "భరతా! నీ తల్లి నీకు పట్టంగట్టించడానికై రాముణ్ణి అడవికి పంపింది. శ్రీరాముడి విరహంవల్ల రాజు మరణించాడు. ఇక నిరాటంకంగా రాజ్యం పాలించుకో" అన్నది. భరతుడు ఆమె మాటలు విని భరించలేక పోయాడు. అతడు కౌసల్యతో "తల్లీ! నేను శ్రీరామునికి ద్రోహం చేయ తలపెట్టినవాడినే కనక అయితే, రాజ్యం కోరుకున్న దుష్టాత్ముణ్ణే అయితే, కైక చేసిన కపటనాటకం తెలిసివుంటే, బ్రాహ్మణుణ్ణి చంపినవాని గతికి, గురుభార్యను చెరచినవాని గతికి, కల్లు త్రావినవాని గతికి, బంగారం దొంగిలించిన వాని గతికి పోతాను. అఖిల మునులు దేవతలు సూర్యచంద్రులు ఇందుకు సాక్షులు" అని పలికెను. అఖిల భూతములు భరతుడి మాటలు సత్యము, సత్యమని ప్రతిధ్వనించినవి.

తరువాత భరతుడు తండ్రికి అగ్నిసంస్కారాదులు నిర్వర్తించినాడు. వశిష్ఠుడు మునులను మంత్రులను రావించి భరతుని చూచి పట్టము గట్టు కొనుమని పలికెను. భరతుడు "మునివరా ! నేనట్టి మాటలను వినజాలను. పుణ్యగుణాభి రాముడైన శ్రీరాముని ప్రార్థించి తీసుకునివచ్చి పట్టాభిషిక్తుని గావింతును. ఆయన రాకున్నచో నేనును తపస్వి వేషముతో అడవులలోనే ఉందును" అని పలికి సర్వసైన్యయుతుడై శ్రీరాముడు ఉన్న చిత్ర కూటమునకు పయనమయ్యెను.

సైన్యసమేతంగా వస్తున్న భరతుని దూరం నుంచి చూచాడు లక్ష్మణుడు. వెంటనే ఈ విషయం రామచంద్రునికి తెలిపి లక్ష్మణుడు "అన్నా! మనలను వీడు ఇక్కడ కూడా ఉండరాదని భావించి చంపడానికై సేనతో వస్తున్నాడు. నీవు కవచం ధరించి యుద్ధానికి సిద్ధంగా ఉండు. నీ శాంతియే నిన్నింత చేసినది. ఇక వీనిని ప్రాణాలతో వదలను" అని లక్ష్మణుడు కోపోగ్రుడై పలికాడు. రాముడు వాని మాటలు విని "లక్ష్మణా! నాకు తమ్ముడివై ఉండి కూడా నీవిట్టి నీచోక్తులు ఎలా పలుకుతున్నావు ? నీ కంటె భరతుడు నా భక్తుడు. మనలను మరల అయోధ్యకు తీసుకుని వెళ్ళడానికై వస్తున్నాడు" అన్నాడు. లక్ష్మణుడు సిగ్గుతో తలవంచుకున్నాడు.

అల్లంత దూరంలో సైన్యాన్ని నిలిపి, శత్రుఘ్నునితో కూడి భరతుడు రాముడు ఉన్న పర్ణశాల దగ్గరకు వెళ్ళి రామలక్ష్మణులకు సీతాదేవికి ప్రణామం చేశాడు. అనంతరం రాముడు వనవాసానికి వచ్చిన తరువాత జరిగిన విశేషాలన్నీ వారికి చెప్పాడు. చిత్రకూట పర్వత ప్రాంతంలో ఉన్న మునీంద్రులు కిన్నరులు కింపురుషులు మొదలైనవారి సమక్షంలో "అన్నా! రామచంద్రా! కైక చేసిన పాప కృత్యానికి కోపగింపక నా మాట మన్నించు. నీ రాజ్యలక్ష్మిని భరించడానికి నాకు శక్తి లేదు. నీవు తిరిగి వచ్చుటకు అంగీకరించకపోతే ఇక్కడే నీ ముందే ప్రాయోపవేశం చేస్తాను" అని దర్భాసనం వేసుకుని కూర్చున్నాడు. శ్రీరాముడు భరతుణ్ణి ప్రేమతో కౌగలించుకొని "ఇదియేమి భరతా! మన కులాచార ధర్మములు పాటింపకుండా మాట్లాడుతున్నావు. నా వంటివాడే తండ్రిమాట పాలింపకపోతే లోకంలో ఉన్న ప్రజలందరూ ఎలా నడుచుకుంటారు? నేను వనవాసం పూర్తి అయిన తర్వాత అయోధ్యకు తిరిగి వస్తాను" అన్నాడు.

అంత వశిష్ఠుడు రామచంద్రునితో "రామచంద్రా! నిన్ను భరతుడు భక్తియుక్తుడై ప్రార్థిస్తున్నాడు. భక్తవత్సలుడవైన నీవు అతనికి నీ పాదుకలను అనుగ్రహించు" అన్నాడు. రాముడందుకు అంగీకరించాడు. గురుని ఆజ్ఞానుసారం రామచంద్రుని పాదుకలను భక్తితో శిరస్సుమీద పెట్టుకుని అయోధ్యకు తీసుకొనివచ్చి, శ్రీరాముని పాదుకలకు పట్టాభిషేకం చేసి, అన్నగారి అనుశాసనం ప్రకారం, భరతుడు రాజ్యాన్ని పరిపాలించాడు. భరతుడు సర్వ రాజ్యభోగాలు అనుభవించే అవకాశం ఉన్నప్పటికీ, అన్నలాగా నారబట్టలు కట్టుకొని, కందమూలాలే ఆహారంగా, కటిక నేలపైననే నిద్రిస్తూ బ్రహ్మచర్యం అవలంబించాడు.

అందుకే భరతుని వంటి భ్రాతృభక్తి తత్పరుడు ప్రపంచంలోనే లేడు - అంటారు.



## 4

# గురుస్తుతి

బ్రహ్మానందం పరమ సుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగన సదృశం తత్త్వమస్యాది లక్ష్యమ్।
ఏకం నిత్యం విమల మచలం సర్వధీ సాక్షిభూతం
భావాతీతం త్రిగుణ రహితం సద్గురుం తం నమామి.

# భాస్కరా!

అలఘు గుణప్రసిద్ధుఁడగునట్టి ఘనుం డొకఁడిష్టుఁడై తనున్
వలచి యొకించు కేమిడిన వానికి మిక్కిలి మేలుచేయుఁగాఁ
దెలిపి కుచేలుఁ డొక్క కొణిదెం డటుకుల్ దనకిచ్చినన్ మహా
ఫలదుఁడు కృష్ణుఁ డత్యధిక భాగ్యము లాతని కీడె భాస్కరా!

**భావము :** *సద్గుణములు గలిగిన తన స్నేహితుడు ప్రేమతో ఎంత స్వల్పమైన పదార్థము లిచ్చినను, వానికి గొప్ప మేలే కలుగజేయును. తనకు బాల్యమిత్రుడైన కుచేలుఁడు అనురాగముతో చేరె డటుకు లిచ్చినంత మాత్రమున శ్రీ కృష్ణుడు వానికి అత్యధిక భాగ్యములను సమకూర్చెను గదా!*

★★★★

# తోటకాచార్యులు

అద్వైత ధర్మ ప్రతిష్ఠాపకులలో ఆచార్య శంకరులు అగ్రగణ్యులు. ఒకనాడు శంకరాచార్యులవద్ద ఒక బ్రాహ్మణ బాలుడు శిష్యునిగా చేరాడు. అతడు మిక్కిలి మంద బుద్ధి. అతడెన్నిసార్లు చదివినా పాఠములు వచ్చేవి కావు. చెప్పిన విషయాన్ని వెంటనే గ్రహించే శక్తి లేదు. కాని అతనికి గురువుగారంటే అఖండమైన భక్తి. ప్రతిరోజూ ఉదయమే గురువుగారి కంటె ముందు నిద్రలేచి, గురువుగారు నిద్రించేవరకు సకల పరిచర్యలు చేసేవాడు. గురువుగారు నిద్రలేచేసరికి ముఖం కడుగుకొనటానికి నీరు, దంత కాష్ఠము సిద్ధం చేసేవాడు. వారి స్నానానికి నీరు సిద్ధంగా ఉంచేవాడు. వారి శాటీలను ఉతికి శుభ్రం చేసి ఆరవేసి సిద్ధం చేసేవాడు. ఈ రకంగా ఈ పని ఆ పనీ అనే సంకోచం లేకుండా సమస్త ఉపచారములు చేస్తూ గురు చిత్తానుసారం ప్రవర్తిస్తూ సర్వదా ఛాయవలె సంచరించేవాడు. అందరూ అతనిని ''గిరి'' అని పిలిచేవారు.

ఒకనాడు ఆచార్య స్వాములవారు శిష్యులకు భాష్య పాఠములు చెప్ప సంసిద్ధులైనారు. శిష్యులందరూ గురుదేవులకు నమస్కరించి పాఠములకై ఎదురుగా కూర్చున్నారు. గిరి రాలేదు. ఆచార్య స్వాములవారు గమనించారు. గిరి ఆ సమయంలో గురువుగారు స్నానం చేసి వదలిన శాటీలను ఉతికి మంచి తీర్థము తీసుకురావడానికి నదికి వెళ్ళాడు. శంకర భగవత్పాదులు ప్రశాంత గంభీర స్వరంతో ''శిష్యులారా! గిరి నదికి వెళ్ళాడు. తిరిగి వచ్చే వేళైంది. కొద్ది కాలం ఆగి అతడు కూడ వచ్చిన తర్వాత పాఠం ప్రారంభిద్దాము'' అన్నారు. శిష్యులు అప్రయత్నంగా 'చిత్తం' అన్నారు. కాని వారందరకు అతడంటే అల్ప భావం ఉంది. గిరి మందమతి అనీ, గురువు గారు చెప్పేది వాడి తలకెక్కదనీ వాళ్ళకి అతడంటే లెక్కలేదు. గిరి పేరుకు తగినట్లుగా గిరి (కొండ) వంటివాడే . ఆ చదువురాని మొద్దు వచ్చే వరకు వేచి యుండటం అనవసరం అని గుసగుస లాడసాగారు. వారిలో ఒకడు తన చూపుడు వ్రేలుతో పుస్తకాన్నీ ఎదురుగా నున్న గోడను చూపుతూ ఈ భాష్య పాఠం ఆ గోడకు చెపితే ఎంతో వాడికి చెప్పినా అంతే నన్న భావాన్ని వ్యక్తం చేశాడు.

శిష్యుల అభిప్రాయం శంకరదేశికులు గ్రహించారు. గురుభక్తి తత్పరుడైన గిరి అంటే వారికి వాత్సల్యం, కరుణ పొంగిపొరలాయి. ఈ శిష్యుల గర్వాన్ని

హరించాలని, గిరి చేస్తున్న గురు శుశ్రూషకు ఫలమివ్వాలని వారు భావించారు. కరుణాంతరంగంతో వారు కన్నులు మూసుకు కూర్చున్నారు.

కొంచెం సేపటికి గిరి ఉతికిన శాటీలను భుజంపై వేసుకుని మంచి నీటి పాత్రతో పెద్దగా శ్లోకములు చదువుతూ రావటం శిష్యులు గ్రహించారు. ఏనాడూ పాఠాన్నప్పగించని గిరి ఈనాడు ధారాళంగా శ్లోకములు చదువుట వారికి అమితాశ్చర్యం కల్గించింది. క్రమంగా శాటీలను ఆరవేసి మంచినీటి పాత్రను ఒక పక్కగా నుంచి శ్రద్ధాభక్తులతో ఆచార్య స్వాములకు సాష్టాంగపడి వారిని గిరి ఇట్లు నుతించాడు.

***విదితాఖిల శాస్త్ర సుధా జలధే! మహి తోపనిషత్కధితార్థ నిధే!***
***హృదయే కలయే విమలం చరణం, భవ శంకర! దేశిక! మే శరణమ్.***

***కరుణావరుణాలయ! పాలయమాం భవ సాగర దుఃఖ విదూన హృదమ్,***
***రచితాఖిల దర్శన తత్త్వ విదం, భవ శంకర! దేశిక! మే శరణమ్.***

***భవతా జనతా సుహితా భవితా నిజ బోధ విచారణ చారుమతే***
***కలయేశ్వర జీవ వివేక విధం, భవ శంకర! దేశిక! మే శరణమ్***

సంస్కృత భాషలో కష్టమైన తోటక వృత్తాలను గురు కరుణాకటాక్షవీక్షణంతో చెప్పగలిగిన గిరి ఆనాటి నుండి తోటకాచార్యుడుగా ప్రసిద్ధి చెంది శంకర భగవత్పాదుల శిష్య చతుష్టయంలో ఒకరైనారు.

గురు కటాక్ష వీక్షణంలో సర్వ విద్యలు వాటంతట అవే వచ్చి వరిస్తాయి. అందువల్లనే "ఆచార్య దేవో భవ" అని మనం నమస్కరిస్తాము.

★ ★ ★ ★

## 5

# దైవస్తుతి

మందార మూలే మదనాభిరామం
బింబాధరా పూరిత వేణునాదమ్
గో గోప గోపీజన మధ్య సంస్థం
గోపం భజే గోకుల పూర్ణచంద్రమ్

## భాస్కరా!

ఒరు గుణవంతు డొర్లు తన కొం డపకారము చేయునప్పుడున్
పరహితమే యొనర్చు. నొకపట్టున నైనను గీడుఁజేయఁగా
నెఱుఁగడు. నిక్కమే కద యదెట్లనఁ గవ్వముఁ బట్టి యెంతయున్
దరువఁగఁ జొచ్చినన్ బెరుగు తాలిమి నీయదె వెన్న, భాస్కరా!

**భావము :** గుణవంతుడు ఇతరులు తన కపకారము చేసినను, ఒకప్పుడైనను వానికి కీడుచేయక ఉపకారమే కావించును. ఎట్లనగా, పెరుగును కవ్వముతో ఎంత తరచిన అంత వెన్న నిచ్చునుగదా! అనగా పరుల కపకారము చేయనివాడే గుణవంతుడని తాత్పర్యము.

★★★★

# శిశుపాలుడు

శిశుపాలుడు చేది దేశానికి రాజు, శ్రీకృష్ణుని మేనల్లుడు. శిశుపాలుని తండ్రి దమఘోషుడు. తల్లి సాత్వతి, సాత్వతి శ్రీకృష్ణుని మేనత్త. శిశుపాలుడు నాల్గుచేతులతో, మూడవకంటితో జన్మించాడు. కుమారుని వికారాకారం చూసి తల్లిదండ్రులు భయవిస్మయాలతో మిక్కిలి దుఃఖిస్తుండగా అశరీరవాణి "వీనిని ఎవరు ఎత్తుకొన్నపుడు మిగులువున్న రెండు చేతులూ, కన్నూ అదృశ్యమై పోతవో వాడే వీని మరణ కారకుడౌతాడు" అని చెప్పింది. అశరీరి వాక్యాలు విని ఆశ్చర్యపడి చూడవచ్చిన వారికెల్ల కుమారుణ్ణి ఇచ్చేవారు. కొంతకాలం అనంతరం మేనత్తను చూడడానికై బలరాముడూ శ్రీకృష్ణుడూ మంత్రిబాంధవ సమేతంగా వచ్చారు. వచ్చినవారికి ప్రేమతో సత్కారాలు జరిపి సాత్వతి కుమారుణ్ణి ముందు బలరాముడికిచ్చి, తరువాత శ్రీకృష్ణుడి కిచ్చింది. శ్రీకృష్ణుడు వాడిని ఎత్తుకోగానే వాడికి అదనంగా ఉన్న రెండు చేతులూ, మూడవకన్నూ మటుమాయమై పోయినవి. అశరీరవాణి వాక్యాలు గుర్తుకు వచ్చి సాత్వతి శ్రీకృష్ణుడితో "ఉపేంద్రా! వీడు దుర్మార్గుడై నీకు అనిష్టంగా ప్రవర్తించినప్పటికీ నూరు తప్పులవరకు క్షమించు" అని ప్రార్థించింది. శ్రీకృష్ణుడు మేనత్త కోరికను మన్నించాడు.

ధర్మరాజు మహా వైభవంగా రాజసూయయాగం చేశాడు. బ్రాహ్మణులను అనేక దక్షిణలతో సత్కరించాడు. అఖిల రాజులకు సముచిత సత్కారాలు చేశాడు. అగ్నిముఖంగా వివిధ దేవతలను మంత్రాహుతులతో సంతృప్తులను చేశాడు. బ్రహ్మాండంగా అన్నదానం చేశాడు. ఎక్కడ చూచినా ధర్మరాజు ప్రశంసలే వినబడుతున్నవి.

మహాసభ తీరి ఉన్నది. కురువృద్ధుడైన భీష్ముడు సకల సద్గుణ విరాజితుడైన పురుషోత్తముడికి అర్ఘ్యం సమర్పించుమని ధర్మరాజును ఆదేశించాడు. తన సహస్ర కిరణాలతో భూమ్యాకాశాలను ప్రకాశింపజేస్తున్న సూర్యుని వంటి వాడును, సకల జనులను తన అమృత చంద్రికలతో ఆనందింపజేస్తున్న చంద్రుని వంటివాడును, అద్యంతములు లేనివాడును, సజ్జనులచేత సేవింపబడునట్టివాడను అయిన శ్రీకృష్ణుడు అర్ఘ్యమునకు అర్హుడని చెప్పాడు భీష్ముడు. భీష్ముని ఆదేశానుసారం సహదేవుడు తీసుకొనివచ్చిన అర్ఘ్యం శ్రీకృష్ణుడికి సమర్పించాడు ధర్మరాజు.

ఇది చూచి సహించలేక సభలో ఉన్న శిశుపాలుడు లేచి "ఓ ధర్మరాజా! ఇంతమంది పూజార్హులైనవారు సభలో ఉండగా భీష్ముని దురుపదేశంతో

శ్రీకృష్ణుణ్ణి పూజించి నీ తెలివి తక్కువ తనం ఋజువు చేసుకున్నావు. ఈ భీష్ముడు వృద్ధుడు. ముసలివారి బుద్ధులు నిశ్చలంగా ఉండవు. అస్థిరమైనవి. శ్రీకృష్ణుడు మీ కిష్టమైనవాడైన అతనికి ధన మీయవచ్చు. ఇష్టమైన కార్యములు చేయవచ్చు. ఇంతమంది మహాత్ములు ఉన్న సభలో పూజార్హుడుకాని వీనికి పూజ చేసి రాజులందరిని అవమానించావు. ఈ శ్రీకృష్ణుడు వసుదేవునికంటె పెద్ద అని పూజించినావా? కృపాచార్యుడు, ద్రోణాచార్యుడు ఉండగా గురువని పూజించినావా? ఒక వేళ నీవు పూజించినను తగుదునమ్మా అని ఈ కృష్ణుడేల స్వీకరించవలెను? వీనిని పూజించుట నపుంసకునకు పెండ్లి చేయుట వంటిది. చెవిటివానికి మధురమైన సంగీతము వినిపించుట వంటిది. గ్రుడ్డివానికి సుందర రూపమును చూపుటవంటిది'' అని పెక్కు విధముల దూషిస్తూ కోపంతో పుత్ర మిత్రులతో కూడి సభాభవనం నుండి బయటకు వెళ్ళారు.

ధర్మరాజు వానివెంట వెళ్ళి ప్రియమైన వాక్యాలతో అనునయిస్తూ ''గుణ సంపన్నులైనవారికి వాక్పారుష్యము తగదు. ఆ వాక్కాఠిన్యము విషము కంటె, అగ్ని కంటెను ప్రమాదకరమైనది'' అని పలుకుతూ, సకల సృష్టికర్తయైన బ్రహ్మ పుట్టుకకే కారణమైన శ్రీకృష్ణుని గొప్పతనాన్ని వివరించి చెప్పాడు. ధర్మజుని మాటలు వాడి చెవి కెక్కలేదు. భీష్ముడు లేచి ''సభలో ఉన్న రాజులందరు శ్రీకృష్ణుని దయచేతనే రాజ్యపాలనం చేస్తున్నారు. శ్రీకృష్ణుని పూజించుటవల్ల త్రిలోకాలూ సంతోషపడుతాయి. అందుకే ఆయనను పూజించాము''. అని చెప్పాడు. శిశుపాలుడి కోపం కట్టలు త్రెంచుకొని పైకుబికింది. ''ఈ కృష్ణుడు స్త్రీ వధ, గోవధ చేసిన దురాత్ముడు. జరాసంధుని అక్రమంగా భీముడిచేత చంపించిన వాడు''. అని పలికి కృష్ణుణీ, భీష్మునీ, ధర్మరాజునీ నానా విధాలుగా దూషిస్తూ, పరాక్రమం ఉంటే యుద్ధానికి సిద్ధం కమ్మన్నాడు. శిశుపాలుడి గర్వం హరించాలనుకుని శ్రీకృష్ణుడు, రాక్షసాంతకమైన చక్రంతో వాడి శిరస్సును ఖండించి వేశాడు. దుర్నీతి పరుడూ, రాజ్యమదాంధుడూ, నిష్కారణంగా పెద్దలను దూషించే లక్షణం కలిగిన శిశుపాలుడు హతమైపోయాడు. అందుకే అకారణంగా పెద్దలను దూషించరాదు, గర్వోక్తులు పలుక కూడదు, అట్లాచేస్తే శిశుపాలుడికి పట్టిన గతే పడుతుంది.

★ ★ ★ ★

## 6

### దైవస్తుతి

సుగ్రీవ మిత్రం పరమం పవిత్రం
సీతాకళత్రం నవమేరు గాత్రమ్
కారుణ్య పాత్రకం శతపత్ర నేత్రం
శ్రీరామచంద్రం సతతం నమామి

### భాస్కరా!

ఊరక సజ్జనుం డొదిగి యుండిననైన దురాత్మకుండు ని
ష్కారణ మోర్వలేక యపకారము చేయుట వాని విద్యగా,
చీరెలు నూరుటంకములు చేసెడివైనను బెట్టి నుండగాఁ
జేరి చినింగిపోఁ గొఱుకు చిమ్మట కేమి ఫలంబు భాస్కరా !

**భావము :** సజ్జనుడగు వ్యక్తి ఎంత యొదిగి యున్నను, నిష్కారణముగా దుర్జనుడు వాని కపకారమే చేయ తలపెట్టును. పెట్టెయందు ఎంత విలువగల చీరలున్నను, చిమ్మట తనకేమి ప్రయోజనము లేకున్నను ఆ పెట్టెలో ప్రవేశించి ఆ గుడ్డలను కొరికి పాడుచేయును.

★★★★

# దండుడు

ఇక్ష్వాకుని కుమారులలో దండుడు ఒకడు. బాల్యము నుండి అతడు ప్రతి వారిని దండిస్తూ హింసిస్తూ ఉండేవాడు. రాజకుమారుడుగా అతడు ప్రజలనుండి తగు గౌరవాభిమానాలను పొందలేక పోయాడు. ప్రజలు తన్ను గౌరవించక తృణీకరిస్తున్నారనే ఆలోచన కలగగానే అతడు మరీ పెచ్చుపెరిగి పోయాడు. తన మాటను కాదన్నవాడిని ఏ మాత్రం సహించక శిక్షించేవాడు. ఈ అసహనానికి తోడు, అతనిలో స్త్రీ వ్యామోహం అంకురించింది. ఇక్ష్వాకుడు కుమారుని స్థితిగతులను అర్థం చేసుకున్నాడు. బాధ్యతా రహితంగా అతడుండుటే దీనికి కారణమని నిశ్చయించుకున్నాడు. వెంటనే అతని వివాహం జరిపించాడు. రాజ్యభారంతో దండుడు సన్మార్గంలోనికి వస్తాడని ఆశించాడు. ఆ తండ్రి, వెంటనే తన రాజధానికి దూరంగా ఒక పట్టణాన్ని నిర్మించి ఆ ప్రాంతం అంతటిని ఒక రాజ్యంగా ఏర్పరచి కుమారుడైన దండుని రాజుగా నియమించాడు.

దండుడు రాజై అనుకూలవతి అయిన భార్యతో సుఖంగా ఉంటూ రాజ్యపాలన చేస్తున్నాడు. రాచ మర్యాదలు, భటుల కైవారాలు, వైతాళికుల స్తోత్రపాఠాలు అతనికి సంతోషాన్ని ఆనందాన్ని కల్గించినాయి. రాజగురువైన శుక్రాచార్యులు అప్పుడప్పుడూ రాజభవనానికి వచ్చి దండునకు సన్మార్గోపదేశం చేసి వెళ్తూండేవాడు.

ఒకనాడు దండుడు వేటకు వెళ్ళాడు. మృగయా వినోదంతో సంతుష్టుడై తిరిగి వస్తూ రతికేళీ వినోదంలో ఆనందిస్తున్న మృగాలను చూచి మదన బాణ పీడితుడైనాడు. మార్గసమీపంలో శుక్రాచార్యుల ఆశ్రమాన్ని చూచాడు. గురువులను దర్శించు తలంపుతో ఆశ్రమంలోనికి వెళ్ళాడు. అచ్చట అతనికి యౌవనంలో ఉన్న ఒక లతాంగి దర్శనమిచ్చి ఆప్యాయంగా పలుకరించి ఆతిథ్యమిచ్చింది. ఆమె తనూసౌందర్యము, చిరునగవులతో దండుడు దారి తప్పాడు. బుద్ధి వక్రమార్గం తొక్కింది. ''కల్యాణీ! నీవు ఎవరి దానవు? శుక్రాచార్యులు ఎచట ఉన్నారు'' అని ఆమెను పలుకరించాడు. ''రాజా! పితృపాదులు శుక్రులు కార్యాంతరమై వెళ్లి యున్నారు'' అని మృదు మధుర కంఠంతో ఆమె సమాధానం చెప్పింది. ఆమె పలుకులు అతనికి అమృతప్రాయములయ్యాయి. అతని హృదయం పులకరించింది.

దండుడు కామాతురుడైనాడు. ' కామాతురాణాం న భయం న లజ్జా ' అన్నట్లు గురుపుత్రి తనకు సోదరితో సమానమనిగానీ, అది గురుదేవుల ఆశ్రమం అని గానీ తలపక ఆమెను బలాత్కరించాడు.

శుక్రాచార్యులు ఆశ్రమానికి వచ్చి దీన వదనంతో, అశ్రుపూరిత నయనాలతో దుఃఖిస్తున్న కుమార్తెను చూశాడు. శుక్రాచార్యులు కృద్ధుడై ఇంద్రుని ప్రార్థించాడు. శుక్రుని ప్రార్థనానుసారంగా దండుని రాజ్యంపై ఇంద్రుడు మట్టితో కూడిన రాళ్ళవర్షం ఎడతెరిపి లేకుండా కొన్ని రోజులుపాటు కురిపించాడు. దండుని సర్వరాజ్యం నశించింది. క్రమంగా అచ్చట ఒక మహారణ్యం ఏర్పడింది. దండుని కారణంగా ఏర్పడినదిగాన దానికి దండకారణ్యం అను పేరు వచ్చింది.

అన్యకాంతల ఎడ మాతృభావం కలిగియుండటం మన జీవన నియమాలలో ఒకటి. దానిని ఉల్లంఘించినవాడు దండుడు వలెనే నాశనమౌతాడు.

★ ★ ★ ★

**ఆలస్యం హి మనుష్యాణాం శరీరస్థో మహాన్ రిపుః,**
**నాస్త్యుద్యమ సమో బంధుః కుర్వాణో నావసీదతి .**

★ ★ ★ ★

## దైవస్తుతి

కరారవిందేన పదారవిందం
ముఖారవిందే వినివేశయంతమ్,
వటస్య పత్రస్య పుటేశయానం
బాలం ముకుందం మనసా స్మరామి.

## భాస్కరా!

కట్టడ దప్పి తాము చెడు కార్యముఁ జేయుచు నుండిరేని తో
బుట్టిన వారినైన విడిపోవుట కార్యము; దొర్మదాంధ్యమున్
దొట్టిన రావణాసురునితో చెడఁబాపి విభీషణాఖ్యుఁ డా
పట్టున రాముఁ జేరి చిరపట్టము గట్టుకొనండె భాస్కరా!

భావము : ధర్మము వీడి చెడుపని చేయుచున్నట్లయితే, తోబుట్టువు లయినను వారిని విడిచిపెట్టుట శ్రేయస్కరము. పూర్వము దుర్మదాంధుడైన రావణాసురుని వీడి శ్రీరామచంద్రుని సమీపించి విభీషణుడు లంకకు రాజయ్యెను గదా! రావణుడు తన సోదరుడైనను మదాంధుడు కావున విభీషణుడు వానిని విడిచిపెట్టి వచ్చెను.

★★★★

# జయదేవుడు

జయదేవుడు మహాభక్తుడు. శ్రీ మహావిష్ణు అంశమున ఈ ప్రపంచమున భక్తిని ప్రబోధించుటకు జన్మించినాడు. వింధ్య దేశపు రాజు అతని ఆప్తమిత్రుడు, శిష్యుడు కూడా. ఆ రాజు జయదేవుని ఉపదేశములను తు.చ. తప్పకుండ అనుసరించెడి వాడు. జయదేవుని ఉపదేశమున ఆ రాజు భాగవతుల నెల్లరను పూజింపసాగెను. రాజుయొక్క సద్బుద్ధికి జయదేవుడు ఆనందించెడివాడు. జయదేవుని భార్య పేరు పద్మావతి. ఆమె మహా పతివ్రత. భర్త ఔన్నత్యమును, మహత్వమును ఎరిగినది. అందువలన సదా అతనినే స్మరించుచు, సేవించు చుండెడిది. రాజ దంపతులు జయదేవుని, అతని భార్యయగు పద్మావతిని మిగుల భక్తి భావముతో సేవించుచుండిరి.

ఒకనాడు పరిచారికలతో గూడి రాణి పద్మావతీదేవి సన్నిధిన గూర్చుండి పుణ్యకథలను వినుచుండెను. అంతలో నొక పరిచారిక విషణ్ణ వదనముతో రాణిని సమీపించి – ''అమ్మా! మీ సోదరుడు చనిపోయెను. మీ వదినగారు తన భర్త చితిపై గూర్చుండి సహగమనము చేసిరి'' అని చెప్పెను. ఆ విషాద వార్త విని రాణి తన సోదరుని మృతికి, వదినగారి సహగమనమునకు గోలు గోలున ఏడ్చెను. కాని పద్మావతి నిశ్చలముగా ఎట్టి ఉలుకు అలుకు లేక కూర్చున్నది. పద్మావతి అట్లు మౌనము వహించుట రాణికి కష్టమయ్యెను. అన్న మరణమునకు సానుభూతిగాని పరమ పతివ్రత ధర్మమైన వదినగారి సహగమనమునకు సంతోషముగాని ఆమె ప్రకటింపదాయెను. రాణి ఉండబట్టలేక ''అమ్మా ఈ వార్త వలన నీవు దుఃఖముగాని సంతోషముగాని పొందక ఉంటివి. అందులకు కారణమేమి'' అని అడిగెను. అంత పద్మావతి ''మరణము శరీర లక్షణము. అందులకు దుఃఖించవలసిన దేమీ లేదు. మహాపతివ్రత తన భర్త మరణవార్త చెవికి సోకినంతనే ప్రాణములు వదలును. ప్రయత్న పూర్వకముగా భర్త చితిపై ప్రాణములు వదలుటు ఆత్మహత్యా సదృశమే గదా!'' అని పలికెను. ఈ మాటలు రాణికి ఆశ్చర్యము కల్గించెను. మహా పతివ్రత వలె ఈమె పల్కుచున్నది! ఈమె పాతివ్రత్యమును పరీక్షింపవలెనని రాణి నిశ్చయించుకున్నది. అనుకూల సమయమున రాణి ఆ సంగతిని మంత్రికి తెలిపెను. ''సమయము వచ్చినపుడు ఆ కార్యములు నేను జక్కపెట్టెదను'' అని మంత్రి పలికి వెళ్ళిపోయెను.

ఒకనాడు రాజు మహారణ్యమునకు వేటకు బోవుచు జయదేవుని వెంట తీసుకొనిపోయెను. ఆ అదను చూచుకొని పద్మావతీదేవి చెంత మహారాణి మాట్లాడుచున్న సమయమున మంత్రి వచ్చి "తల్లీ! జయదేవులతో సహా మహారాజు వేటకై మహారణ్యములో బోవుచుండగా దగ్గరలో పొదనుండి భయంకరమైన బెబ్బులి వారిపై బడెను." మహారాజు గాయపడి ఎట్లో ప్రాణములతో బయటపడిరి. కాని దురదృష్టవశమున జయదేవులు మరణించిరి అని నుడివెను. రాణి దుఃఖమును అభినయించుటకు ముందే ఆ వార్త తన కర్ణపుటమునకు సోకినదే తడవుగ పద్మావతి భూమిపై బడి ప్రాణములను వదలెను. వైద్యులచే పరీక్ష చేయించగా, వారు పద్మావతి మరణమును ధృవపరిచిరి. రాణి భయభీత చిత్తయయ్యెను. తాను చేసిన కుట్ర ఫలితముగా తనకెట్టి ఉపద్రవము, అపకీర్తి కలుగునోయని తల్లడిల్లి పోయెను.

మంత్రి రాజునకు యధార్థము చెప్పెను. అట్టి ఘోరకృత్య మొనర్చిన తన భార్యను చంపుటకంటె, తాను బ్రతికియుండుటకంటె అగ్ని ప్రవేశము చేసి మరణించుట మేలని రాజు నిర్ణయించుకొనెను. గురుదేవుని అనుమతికై జయదేవుని సమీపించెను. అంతకు మునుపే, జరిగిన వృత్తాంతమును పరిచారికల వలన జయదేవుడు తెలిసికొనెను. రాజు మరణ ప్రయత్నమును మాన్పి అతనితో జయదేవుడు భార్య కళేబరము వద్దకు వచ్చెను. భక్తి పారవశ్యముతో జయదేవుడు ఇరువది నాలుగు అష్టపదులు పాడుచు నృత్యము చేసెను. శ్రీ మహావిష్ణువు ప్రత్యక్షమై పద్మావతిని బ్రతికించెను.

భక్తికి అసాధ్యమైనదీ ఇలలో ఏమియూ లేదు. కారణము పరమేశ్వరుడు భక్తజన వశ్యుడగుటయే గదా!



## దైవస్తుతి

వందే శంభుముమాపతిం సురగురుం వందే జగత్కారణమ్
వందే పన్నగభూషణం మృగధరం వందే పశూనాంపతిమ్
వందే సూర్యశశాంక వహ్నినయనం వందే ముకుందప్రియమ్
వందే భక్తజనాశ్రయం చ వరదం వందే శివం శంకరమ్.

## భాస్కరా!

కామిత వస్తు సంపదలు గల్గు ఫలం బొరు లాస పడ్డ చో
నేమియుఁ బెట్టఁడేని సిరియేటికి? నిప్పుల ముస్న బోయినన్
బ్రామికపడ్డ లోకులకుఁ బండగ నేమవి యెండి పోవఁగా
నేమి ఫలంబు? చేదు విడ దెన్నటికైన ముసిండి, భాస్కరా!

భావము : తన దగ్గరకు వచ్చి ఆశ్రయించిన వారికి పెట్టకపోయినచో, అట్టి వ్యక్తికి సంపద ఉన్నను ఒకటే, లేకున్నను ఒకటే. అనగా నిష్ప్రయోజనము. ఎప్పుడు చేదును విడనాడని ముసిడి చెట్టు ఎండినను పండినను ఒకటే. ఫలమేమియు నుండదు గదా!

★★★★

# ఇందీవరాక్షుడు

ఇందీవరాక్షుడు ఒక గంధర్వుడు. అతడు మేధా సంపన్నుడు. గర్విష్ఠి . భూలోక వాసియైన తన మిత్రుడు అనారోగ్యం వలన పడిన బాధ చూచి అతనికి ఆయుర్వేదమును అధ్యయనము చేయవలెనన్న కోరిక కలిగెను. ఇందీవరాక్షుడు ఆయుర్వేద విద్య యందు మహాపండితుడైన బ్రహ్మామిత్రుడను మునిశ్రేష్ఠుని సమీపించెను. విద్యార్థి గురువుల ఎడ చూపవలసిన భక్తి శ్రద్ధలను చూపక ఆ మునిశ్రేష్ఠునితో "మహర్షీ ! నాకు ఆయుర్వేద విద్యను పొందవలెనన్న కోరిక గలిగినది. దయతో నాకు ఆ విద్యను ఉపదేశింపుడు" అని పలికెను. బ్రహ్మామిత్రునికి ఇందీవరాక్షుని స్వరమందు అహంకారము గోచరమయ్యెను. అందువలన ఆ ముని ఇందీవరాక్షుని కోరికను నిరాకరించెను. ఎట్లైననూ ఆ విద్యను గ్రహించి ఆ మునికి తన కార్య చాతుర్యమును, పట్టుదలను తెలియజేయవలెనను కోరిక గలిగెను. కాని ఆయుర్వేద విద్యయందు బ్రహ్మామిత్రుని వంటి పండితులు లేరు. అతనికి మరోమార్గం తోచలేదు. తిరిగి ఆ ముని వద్దకు వెళ్ళి క్షమాభిక్షను కోరుటకు అతని మనస్సు అంగీకరించ లేదు. అందువలన బ్రహ్మామిత్రుడు తన శిష్యులకు ఆయుర్వేద పాఠములు చెప్పునప్పుడు తన తిరస్కరణీ విద్యతో అదృశ్యుడై ఉండి ఆ విద్యను గ్రహించెను. ఆ విధంగా ఇందీవరాక్షుడు విద్యా తస్కరి అయ్యెను.

అంతటితో ఆగక వాడు బ్రహ్మామిత్రుని వద్దకు వెళ్ళి తన విద్యను ప్రదర్శించి నీవు నిరాకరించినంత మాత్రం చేత నేను గ్రహించలేని అసమర్థుడినా అన్నట్లు అవహేళన చేశాడు. ఆ ముని అతని ప్రవర్తనకు కోపించి "భీకర రాక్షసుడవు కమ్ము" అని శాప మిచ్చెను. ఇందీవరాక్షుడు భయభీతుడై శాపవిమోచనము ప్రసాదింపుమని ప్రార్థించెను. ఆ ముని జాలిపడి –"నీ కుమార్తె నీవు వెంటాడు సమయంలో నీ పై ఇతరులు బాణ ప్రయోగం చేసినపుడు శాపవిమోచనము కల్గును" అని చెప్పెను.

ఒకనాడు ఇందీవరాక్షుని కుమార్తెయైన మనోరమ తన స్నేహితురాండ్లతో వన విహారమునకు వచ్చెను. రాక్షస రూపంలో ఉన్న ఇందీవరాక్షుడు అడవులలో వెంటాడెను. ఆమె భీతయై పరువెత్త జొచ్చెను. ఆ సమయమందు వేటకు వచ్చిన ''స్వరోచి'' స్త్రీ ఆర్తనాదము విని రక్షించుటకై అటు పరుగెత్తెను. ఆమె స్నేహితురాండ్లుకూడా ఆర్తనాదము చేసిరి. తమను రక్షించుటకు సిద్ధపడిన స్వరోచికి మనోరమ అస్త్ర హృదయము అను విద్యను బోధించెను. ఈ విద్య సహాయముతో స్వరోచి మనోరమను ఆమె స్నేహితురాండ్లను కాపాడుటకు ఆ రాక్షసునిపై బాణ ప్రయోగము చేసెను. ఆ బాణప్రయోగం వలన ఇందీవరాక్షునికి శాపవిమోచనం కల్గెను. అతడు పూర్వ రూపాన్ని పొంది మనోరమను స్వరోచికిచ్చి వివాహం చేశాడు.

గురువులను అపహాసించుట, విద్యా తస్కరణము పాప హేతువులు - భయంకర పరిణామ దాయకాలు.

★ ★ ★ ★

**వనాని దహతో వహ్నేః సఖా భవతి మారుతః,**
**స ఏవ దీప నాశాయ కృశే కస్యాస్తి సౌ హృదమ్.**

★ ★ ★ ★

## 9

# దైవస్తుతి

నమో భూతనాథం నమో దేవదేవం
నమః కాలకాలం నమో దివ్యతేజమ్.
నమః కామభస్మం నమ శ్శాంతి శీలం
భజే పార్వతీవల్లభం నీలకంఠమ్.

## భాస్కరా!

చదువది యెంత గల్గిన రసజ్ఞత యింతక చాలకున్న నా
చదువు నిరర్థకంబు; గుణ సంయుతు లెవ్వరు మెచ్చ; రెచ్చటం
బదునుగ మంచికూర నలపాకము చేసిననైన నందు నిం
పొదవెడు నుప్పులేక రుచి పుట్టగ నేర్చునటయ్య భాస్కరా !

**భావము :** ఎవరెన్ని విద్య లభ్యసించినను, అందలి మాధుర్యమును గ్రహింపలే పోయినచో ఆ చదువు నిరర్థకమైనది. వానిని పండితుల మెచ్చుకొనరు. ఎంత చక్కగా కూరవండినను, అందు ఎన్ని పదార్థములు వేసినను, రుచికి మూలమైన ఉప్పులేకపోతే, ఆ కూ నాలుకకు రుచించదు. తినుటకు యోగ్యముగా నుండదు.

★★★★

# కనకదుర్గ

పూర్వం భూమండలాన్ని సురథుడు అనే రాజు పరిపాలిస్తూ ఉండేవాడు. అతడు ప్రజలను సొంత బిడ్డలవలె చూసుకుంటూ ధన ధాన్య సమృద్ధితో ఏలుతున్నప్పటికీ శత్రు రాజులు వానిపై దాడిచేసి ఓడించారు. రాజ్యమును కోల్పోయి సురథుడు అరణ్యాలకు వెళ్ళి మేధసుని ఆశ్రమ ప్రాంతంలో సంచరిస్తున్నాడు. మునీంద్రుని సత్కారములనందుకొనిన రాజు మమత్వముచేత ఆకర్షింపబడి ఎల్లపుడు రాజ్య విషయాలను గూర్చి చింతించుచుండెను. ఒకనాడు ఆ ఆశ్రమ సమీపంలోనే శోకగ్రస్తుడై ఉన్న ''సమాధి'' అనే పేరుగల వైశ్యుని చూచాడు. ధనవంతుల ఇంటిలో పుట్టిన వాని దైన్యమునకు హేతు వేమిటని అడిగాడు. ఆ వైశ్యుడు భార్యాపుత్రులు ధన లోభులై తనను విడనాడిన వృత్తాంతమును ఆయనకు వినిపించెను. తన క్షేమమును కోల్పోయినను ఆతడు నిరంతరము తన భార్యా పుత్రులను గురించియే ఆలోచించుచుండెను. సింహాసనమును కోల్పోయినను రాజునకు రాజ్య విషయములను గురించియు, తనను అరణ్యములకు పంపిన భార్యా పుత్రులను గురించియే వైశ్యుడు, తలచుటకును కారణమును తెలుసుకొనగోరి వారు మార్కండేయ మహర్షి కడకు వెళ్ళిరి. మార్కండేయ మహర్షి వారి చిత్తవృత్తికి కారణము విషయ లోలత్వమే అనియు, మానవులు మాయా ప్రభావము చేత మమత అనే సుడిగుండములో పడి పోవుదురనియు, దేవి అనుగ్రహమువలన ముక్తిని పొందవచ్చు ననియు చెప్పెను.

అత్యంత మమకారంవల్లను, రాజ్యభ్రంశం వల్ల ఖిన్నులైన సురథుడు, సమాధి మహాముని వాక్యములను విని తపమొనర్చుటకై వెళ్ళిరి. పరమేశ్వరి సందర్శనార్థమై ఆ వైశ్యుడును రాజును ఒక నదియొక్క ఇసుక దిబ్బమీద కూర్చుండి దేవీ సూక్తమును జపింప ప్రారంభించిరి. మట్టితో దేవీ విగ్రహమును చేసి వారిరువురు పూవులతో ధూపముతోను అగ్ని జల తర్పణములతో ఆమెను అర్చించిరి. నిరాహారులై ఏకాగ్ర బుద్ధితో మనస్సులను ఆమె యందే నిలిపి శరీరరక్త బిందువులతో తడిసిన బలులను సమర్పించిరి.

మూడు సంవత్సరములపాటు చండికను ఇట్లు ఆరాధింపగా, దేవి సంతుష్టురాలై సాక్షాత్కరించి వరములను కోరుకొనుడనెను. రాజు వచ్చే

జన్మమునందు శత్రు బాధలేక రాజ్యము పొందునట్లు వరము కోరుకొనెను. విరక్త చిత్తుడును, వివేక శీలియునగు వైశ్యుడు జ్ఞానమును కోరుకొనెను. దేవి కరుణా కటాక్షము వలన సురథునకు ఆ జన్మమునందే రాజ్యము ప్రాప్తించెను. వైశ్య శేఖరునకు ఆత్మ సాక్షాత్కారము కలిగించు జ్ఞానము లభించెను. భక్తుల ఆకాంక్షను అనుసరించి పరమేశ్వరి 'దుర్గా' నామముతో వెలసి వారి సేవలను గైకొనెను.

అనంతరము మాధవవర్మ ధర్మదీక్షకు సంతసించి దుర్గ కనక వర్షము కురిపించి, లోకమును కరుణించెను. నాటినుండి పరమేశ్వరి ''కనక దుర్గ'' అని ప్రసిద్ధిగాంచెను. ఆమెయే విజయవాటికాధీశ్వరి కనక దుర్గ అమ్మవారు.

★ ★ ★ ★

**సింహః శిశురపి నిపతతి మదమలిన కపోలభిత్తిషు గజేషు,**
**ప్రకృతి రియం సత్త్వవతాం, నఖలు వయస్తేజసో హేతుః**

★ ★ ★ ★

## 10

## దైవస్తుతి

లక్ష్మీం క్షీరసముద్రరాజ తనయాం శ్రీరంగ ధామేశ్వరీం
దాసీభూత సమస్త దేవ వనితాం లోకైక దీపాంకురామ్
శ్రీమన్మంద కటాక్ష లబ్ధ విభవ బ్రహ్మేంద్ర గంగాధరాం
త్వాం త్రైలోక్య కుటుంబినీం సరసిజాం వందే ముకుంద ప్రియామ్.

### భాస్కరా!

పండితులైనవారు దిగువం దగనుండగ, నల్పుడొక్క డు
ద్దండతఁ బీఠమెక్కిన బుధప్రకరంబుల కేమి యొగ్గగున్
కొండొక కోతి చెట్టుకొన కొమ్మల నుండగ గ్రింద గండ భే
రుండ మదేభసింహ నికురంబులు నుండవె చేరి, భాస్కరా !

భావము : పండితులైనవారు ఒకప్పుడు తక్కువ స్థానములో నుండగా అల్పులు ఎక్కువస్థాన మందున్నను ఆ పండితుల కెట్టి లోపమును రాదు. ఏలననగా, ఒక చెట్టు క్రింద గండ భేరుండములు, సింహములు, మదపు టేనుగు లుండగా ఆ చెట్టు కొమ్మమీద కోతులున్నంత మాత్రమున గజ సింహాదుల కెట్టి లోపమును రాదు.

★★★★

# ఏకలవ్యుడు

పాండుకుమారులు ఆచార్య ద్రోణులవద్ద అస్త్ర విద్యాభ్యాసం చేస్తున్నారు. కౌరవులు కూడా ద్రోణుని శిష్యులే. ద్రోణాచార్యులవద్ద విద్యాభ్యాసం చేయటానికి వివిధ దేశాల రాజపుత్రులు కూడ వచ్చి వారి శుశ్రూషను చేసేవారు. అస్త్ర విద్యలో అందరికంటే అశ్వత్థామ, అర్జునులే అగ్రేసరులు. వారిద్దరిలో అర్జుననిదే పైచేయి. గురుసేవా నిరతిలో కూడ అర్జునుడు ఎవరికీ తీసిపోడు. అందువల్ల అతడు గురువులకు అత్యంత ప్రీతి పాత్రుడయ్యాడు.

ఒకనాడు హిరణ్యధన్వుడను నిషాదరాజు కుమారుడైన ఏకలవ్యుడు ఆచార్య ద్రోణుల సన్నిధికి వచ్చాడు. అత్యంత భక్తితో వాడు గురువునకు సాష్టాంగ ప్రణామములు చేసి వినయంతో దోసిలి యొగ్గి నిలబడ్డాడు. అంత ద్రోణుడు చిరునవ్వుతో వాని క్షేమము నడిగినాడు. వాడు వినయంతో ''స్వామీ ! నా పేరు ఏకలవ్యుడు. నా తండ్రి హిరణ్య ధన్వుడను ఎఱుక రాజు. నేను అస్త్ర విద్యాభ్యాసం చేయడానికి తమ సన్నిధికి వచ్చాను. నన్ను గ్రహించి కృతార్థునిగా చేయండి'' అని ప్రార్థించినాడు. ఆచార్య ద్రోణులకు అతని ఎడ వాత్సల్యం కల్గింది. అతని వినయంతో వారి హృదయం సంతోసింది. కాని ఏకలవ్యుడు హీనకులజుడు. తనకు బ్రాహ్మణ క్షత్రియులకు దక్క మిగిలిన వారికి విద్యానుగ్రహము చేయకూడదన్న నియమం ఉన్నది. అందువలన విచారంతో ఏకలవ్యుని అభ్యర్థనను స్వీకరించలేక పోయాడు.

ఏకలవ్యుని హృదయం బాధపడింది. కాని ఏమి చేయగలడు ! ఏమైనా తాను విలువిద్య నభ్యసించాలి. ద్రోణాచార్యులే తన గురువు కావాలి. అని నిశ్చయబుద్ధితో ఆచార్యుని చరణకమలాలకు భక్తితో నమస్కరించి వెళ్ళిపోయాడు. తన అరణ్యంలో ద్రోణాచార్యుల ప్రతిమను మట్టితో తయారుచేసి ప్రతిదినం దానిని భక్తితో పూజిస్తూ దృఢ సంకల్పంతో ధనుర్విద్యాభ్యాసం ప్రారంభించాడు. గురుదేవునిపై భక్తి శ్రద్ధల ప్రభావం వలన అతనికి ధనుర్విద్యా రహస్యాలన్నీ తెలియసాగాయి. అతడు విద్యాభ్యాసం నిరాఘాటంగా సాగిస్తున్నాడు.

ఒకనాడు పాండునందనులు ఆచార్యుల అనుమతి పొంది వేటకై ఆ అరణ్యానికి వెళ్ళారు. వారు తమవెంట ఒక వేటకుక్కను కూడ తీసుకు వెళ్ళారు. అరణ్యంలో వారు క్రూర మృగాలను వేటాడుతూ నలు దిక్కులకు వెళ్ళారు. ఆ శునకం ఏకలవ్యుని కుటీరం వైపు వెళ్ళింది.

దూరంగా నల్లని శరీరంతో మలిన దేహంతో ఉన్న ఏకలవ్యుని చూచి ఆ కుక్క మొరగ సాగింది. వెంటనే ఏకలవ్యుడు తన శరవిద్యా నైపుణ్యంతో అనేక బాణాలు ఒకసారిగా ఆ కుక్కనోటిలోనికి వదిలాడు. ఆ కుక్కనోటినిండా బాణాలతో పాండవుల వద్దకు పరుగెత్తింది. దాన్ని చూచి పాండవులు ఆశ్యర్యపోయారు. ఆ విలుకాని అసమాన విద్యా నైపుణ్యం తమకు లేనందుకు వారు సిగ్గుపడిపోయారు. అందరూ అతని విలువిద్యా నైపుణ్యాన్ని పొగడకుండా ఉండలేకపోయారు. ఆ అజ్ఞాత వీరుడైన దనుర్ధారిని చూడాలనే ఆకాంక్షతో వెదుకుతూ వారు చివరకు ఏకలవ్యుని కుటీరాన్ని సమీపించారు. ఏకలవ్యుడు రాజకుమారులను గాంచి ఎదురుగా వచ్చి స్వాగతం పలికాడు. వికృత రూపంలోనున్న వానిని చూచి "నీ నామధేయమేమి? నీ ఆచార్యులెవ్వరు? అని ప్రశ్నించారు. అంతవాడు "ఆర్యులారా! నేను హిరణ్యధన్వుడను నిషాదరాజు కుమారుడను, ఏకలవ్యుడను. ఆచార్య ద్రోణులు నా గురుదేవులు" అని సమాధాన మిచ్చాడు. పాండవుల ఆశ్చర్యానికి అంతులేదు.

నగరానికి తిరిగివచ్చి అర్జునుడు ఆచార్యులను సమీపంచి "గురుదేవా! మీ శిష్యులలో నా అంతటివాడు మరొకడు లేరన్నారే. కాని ఏకలవ్యుడు నన్ను మించి పోయాడు. అతడెరుగని విలువిద్యా రహస్యం లేదు" అని విన్నవించాడు. చూడండి. ఏకలవ్యుడు గురుభక్తితో విలువిద్య నంతనూ సంపాదించాడు. గురువును మించిన శక్తిగలది గురుభక్తి అని తెల్సుకోవాలి.



## 11

# దైవస్తుతి

శాంతాకారం భుజగశయనం పద్మనాభం సురేశం
విశ్వాధారం గగన సదృశం మేఘ వర్ణం శుభాంగమ్
కాంతం కమలనయనం యోగిహృద్ధ్యాన గమ్యమ్
విష్ణుం భవ భయ హరం సర్వలోకైక నాథమ్.

## కుమారా!

పెద్దలు వద్దని చెప్పిన
పద్దులఁ బోవంగరాదు; పరకాంతల నే
ప్రొద్దే నెదఁ బరికించుట
కుద్దేశింపంగఁ గూడ దుర్విఁ గుమారా!

**భావము :** కుమారా! పెద్దలు వద్దని చెప్పిన పనులు చేయ బూనకుము. ఇతర స్త్రీలను ఎప్పుడయినను చూడవలెనని కోరకుము. ఇవి పనికిరాని పనులు.

★★★★

# కుచేలుడు

కుచేలుడు శ్రీకృష్ణుని బాల్యమిత్రుడు. వీరిరువురు అన్యోన్యం, అనురాగబద్ధులై సాందీపుని వద్ద విద్యాభ్యాసం చేశారు. కుచేలుడు అభిమాన ధనుడు. పరమశాంత స్వభావం కలవాడు. కాని నిరంతరం దారిద్ర్య పీడితుడు. ఇంట్లో గంపెడు పిల్లలు. తిండానికి తిండి, కట్టుకుంటానికి గుడ్డా లేక మలమల మాడిపోయేవారు. ఆత్మాభిమానం కలిగిన కుచేలుడు దరిద్ర బాధ ఎంత పీడించినా, నోరెత్తి ఇతరులను అడిగే వాడుకాదు. తనకు లభ్యమైన ఒక్క కాసునే పదివేల బంగారు నాణెములుగా భావించేవాడు.

ఆయనభార్య పరమపతివ్రత. దుస్సహమైన దరిద్ర బాధతో కృశించిపోయి, పిడికెడు అన్నం కోసం ఆక్రందనం చేసే పిల్లల కేమీ పెట్టలేక ఆ తల్లి మనస్సు క్షోభపడిపోయింది. ఒక రోజు భర్తతో ''జీవితేశ్వరా! దుర్భరమైన ఈ పేదరికం పోవడానికి ఉపాయమేమీ ఆలోచింపక పోయితిరి . మీ బాల్యమిత్రుడైన శ్రీకృష్ణుడున్నాడు కదా! వారి దగ్గరకు వెళ్ళి మన కష్టములను వివరించి, దారిద్ర్యం అనే చీకటిలో కొట్టుమిట్టాడుతున్న మమ్మల్ని శ్రీకృష్ణుని కృపాకటాక్షం అనే సూర్య కాంతితో ఉద్ధరించండి. శ్రీకృష్ణుడు ఆర్త జనులను రక్షించే కరుణావత్సలుడు, దయాసముద్రుడు. మన ఆపదలు విని తప్పకుండా ఆదుకుంటాడు'' అని ఎన్నో విధాల బ్రతిమలాడింది.

భార్య మాటలు విని కుచేలుడు ''నీవు చెప్పినట్లే శ్రీకృష్ణుడి పాదాలను ఆశ్రయిస్తాను. అయితే పెద్దవారి దగ్గరకు వెళ్ళేటప్పుడు వట్టి చేతులతో వెళ్ళకూడదని అంటారు. ఆ మహాత్ముడికి కానుకగా ఇవ్వడానికి ఏమైనా ఉన్నదా'' అని అడిగాడు. ఆమె అట్లేనని భర్త జీర్ణమైన వస్త్రం కొంగుకు కొన్ని అటుకులు మూటకట్టింది. గోవింద సందర్శనోత్సాహియై కుచేలుడు ద్వారకా నగరం ప్రవేశించాడు. రాజమార్గంలో కక్ష్యాంతరములన్నీ దాటి శ్రీకృష్ణుని మణిమయమందిరం ప్రవేశించాడు. శ్రీకృష్ణుడు అల్లంత దూరంలోనే కుచేలుణ్ణి చూచి హంసతూలికాతల్పం నుండి దిగి ఎదురువచ్చి బాల్యమిత్రుణ్ణి ప్రేమమీర కౌగిలించుకున్నాడు. గౌరవంగా తీసుకొనిపోయి తన హంస తూలికా తల్పంమీద కూర్చోబెట్టాడు. కలశంతో నీళ్ళు తెప్పించి కాళ్ళు కడిగి, ఆ నీళ్ళను తన తలపై చల్లుకున్నాడు. విసనకఱ్ఱలతో విసరి మార్గాయాసం తీర్చాడు. కర్పూర దీపంతో నివాళి బట్టాడు. చక్కని పూలు సిగలో తురిమాడు. కర్పూరమిళిత తాంబూలం సమర్పించాడు.

శ్రీకృష్ణుడు చేసిన సేవలకు కుచేలుడు పరమానంద భరితుడై పోయాడు. ఆయన నేత్రములనుండి ఆనంద బాష్పాలు రాలినవి. శుద్ధాంతమందిరంలో ఉన్న కాంతా జనమంతా శ్రీకృష్ణుడు చేస్తున్న ఉపచారములు చూసి "ఆ బ్రాహ్మణుడు పూర్వజన్మలో ఏమి తపస్సు చేశాడో శ్రీకృష్ణుని సేవలందుకుంటున్నాడు" అని ఆశ్చర్యం పొందారు.

మిత్రులిరువురూ బాల్యంలో గురుకులంలో జరిగిన మధుర ఘట్టములను గురించి కొంతసేపు మాట్లాడుకున్నారు. బ్రాహ్మణోత్తమా! సద్వంశమునందు పుట్టిన నీ భార్య నీ కనురూపంగా మెలుగుతున్నదా? చూస్తే ఇల్లూ పిల్లలూ నీకేమీ పట్టనట్లు తోస్తున్నది అని ప్రశ్నించాడు శ్రీకృష్ణుడు చమత్కారంగా. కుచేలుడు "మహాత్మా! త్రిజగద్గురుడవైన నీకు తెలియని దేమున్నది?" అని సాభిప్రాయంగా సమాధానం చెప్పాడు.

శ్రీకృష్ణుడు చిరునవ్వు నవ్వుతూ "నా యందుగల భక్తితో ఉపాయనంగా ఏమి తెచ్చావు? ఆ పదార్థము లేశమైనా పదివేలుగా భావిస్తాను. నీచవర్తనుడై, నా యందు భక్తి లేనివాడు బంగారు కొండ తెచ్చి యిచ్చినా నాకు సమ్మతం కాదు. నిరంతర భక్తియుతులైనవారు పుష్పం తెచ్చినా దళం తెచ్చినా ఒక్క ఫలమిచ్చినా చివరకు నీరు తెచ్చినా పంచభక్ష్య పరమాన్నంతో సమానంగా స్వీకరిస్తాను" అన్నాడు.

కృష్ణుని వినయ వాక్యములు విని, తెచ్చిన అటుకులు సమర్పించటానికి మనసొప్పక కుచేలుడు మాట్లాడకుండా తలవంచుకున్నాడు. కుచేలుడు వచ్చిన కార్యం తన దివ్యచిత్తంతో ఎరిగి, శ్రీకృష్ణుడు "ఈ బ్రాహ్మణుడు పూర్వజన్మలో ఐశ్వర్యకాముడై నన్ను సేవింపలేదు. ఇప్పుడు భార్యా పిల్లలకోసమై ఇక్కడకు వచ్చాడు. ఇతనికి ఇంద్రాదులు కూడ పొందనేరని సంపద్విశేషములు ఈ క్షణంలోనే ప్రసాదిస్తాను" అని నిశ్చయించుకొని, కుచేలుని కొంగున ముడిచి ఉన్న మూట విప్పి, ఒక గుప్పెడు అటుకులు ఆనందంతో ఆరగించాడు. రెండవ పిడికెలి తీసుకొనబోగా రుక్మిణి వారించినది.

ఆ రాత్రి కుచేలుడు గోవిందుని మందిరంలో విందారగించాడు. తెల్లవారగనే కాలోచిత కృత్యములు తీర్చుకొని శ్రీకృష్ణుడు వెంట వచ్చి పంపగా ఇంటికి బయలుదేరాడు. "అయ్యో! ఇంతకూ వచ్చిన పని కృష్ణునికి చెప్పక పోయితినే ? నా పుణ్యఫలమువల్ల ఆ మహానుభావుణ్ణి మాత్రం చూడగల్గాను ." అని మనసులో అనుకుంటూ నిజగృహానికి బయలుదేరాడు.

ఇంటి దగ్గరకు వచ్చి చూసేసరికి ఒక అపూర్వ సుందర సౌధములో భార్యా పిల్లలు దాస దాసీ జనులచేత సేవలు చేయించుకుంటూ మహేంద్ర భోగముతో ఉన్నారు. లక్ష్మీదేవివలె ఉన్న భార్య ఆనంద బాష్పములతో కుచేలునకు ఎదురు వచ్చి నమస్కరించింది. ''అంతా శ్రీహరి కృపాకటాక్షము. ఆ పురుషోత్తముడు భక్తి నిష్ఠ కలిగిన సజ్జనులు ఏ స్వల్పమైన పదార్థం సమర్పించినా దానినే కోటి రెట్లుగా భావించి మన్నిస్తాడు - అనటానికి ఇదే తార్కాణము'' అనుకొని సంతోషంగా కాలం గడుపుతూ శ్రీకృష్ణుని భక్తితో అర్చిస్తూ మోక్షం పొందాడు కుచేలుడు.

*సజ్జన మైత్రికీ, దైవ భక్తికీ కుచేలుడి కథ చక్కని నిదర్శనం.*

★ ★ ★ ★

**ద్వావం భసి నివేష్టవ్యౌ గలే బద్ధ్వా శిలాం దృఢమ్**
**ధనవన్త మదాతారం దరిద్రం చా తపస్వినమ్**

★ ★ ★ ★

## దైవస్తుతి

రామాభిరామం నయనాభిరామం
వదనాభిరామం సుగుణాభిరామమ్,
విశ్వప్రణామం క్రతుభోగకామం
శ్రీరామచంద్రం సతతం నమామి.

### కుమారా!

పనులెన్ని కలిగియున్నను
దిన దినమున విద్య పెంపు ధీయుక్తుడవై;
వినఁగోరుము సత్కథలను
కని విబుధులు సంతసించు గతిని గుమారా!

**భావము :** ప్రతి దినము పనులెన్ని యున్నను బుద్ధిమంతుడవై విద్యను అభివృద్ధి చేసి కొనుము. పెద్దలు చూచి సంతసించునట్లుగా సత్కథలను వినుచుండుము.

★★★★

# జటాయువు

రావణుడు సీతాదేవిని అపహరించాడు. రామలక్ష్మణులు దండకారణ్యంలో ఆమె కొరకు వెదకారు. పర్వతాకారంలో నెత్తురుతో తడిసి పడియున్న గృధ్రరాజైన జటాయువును చూచారు. ''వీడు మాయారూపంలో ఉన్న రాక్షసుడు. నా ప్రియమైన సీతను వీడే తిని విశ్రాంతిగా పడుకున్నాడు. కాన వీడిని సంహరించి వేస్తాను, అని అంటూ రాముడు ధనుస్సు ఎక్కుపెట్టి ధనుష్టంకారం చేశాడు. నెత్తురు కక్కుతూ దీనస్వరంతో జటాయువు ''రామా! రావణుడు పుణ్యవతి అయిన సీతను, నా ప్రాణాలను అపహరించాడు. మీరిద్దరూ లేని సమయంలో సీతాదేవిని వాడు ఎత్తుకునిపోతూ ఉంటే ఆమెను విడిపించుటకు నేను వానిని ఎదిరించి పోరాడాను. నీకు అక్కడ పడియున్న రథం, ధనుస్సు యుద్ధంలో నేను విరుగగొట్టినవే. ఆ రథసారధిని, రథానికి కట్టిన కంచర గాడిదలను నేనే చంపాను. వృద్ధుడ నగుటవల్ల వాడితో పోరాటంలో నేను అలసిపోయినప్పుడు ఆ దుర్మార్గుడు నా రెక్కలను నరికి వేశాడు. అంతట వైదేహిని ఎత్తుకుని ఆకాశమార్గంలో ఎగిరిపోయాడు. ''అని చెప్పింది. ఆ మాటలకు రామునికి కన్నీళ్ళు వచ్చాయి. ధనుస్సు చేతినుండి జారిపడింది. పరుగున వచ్చి ఆ గద్దను కౌగలించుకున్నాడు. దుఃఖంతో నేలపై చతికిలపడి ఏడ్చాడు. లక్ష్మణుని చూచి ''తమ్ముడా! ఈ జటాయువు నాన్నగారి మిత్రుడు. నేను చాల దౌర్భాగ్యుణ్ణి - రాజ్యంపోయింది. నా ప్రియురాలు సీతను కోల్పోయాను. ఆత్మీయుడైన జటాయువు చనిపోవుటకు సిద్ధంగా ఉన్నాడు'' అంటూ ప్రేమగౌరవాలతో దాని శరీరమంతా తడిమాడు. తనకు ఉపకారం చేయుటకు ప్రాణం కూడ లెక్కచేయక యుద్ధం చేసిన ఆ గద్దవంక ఆప్యాయంగా చూస్తూ ఆ రావణుని గురించి, సీదాదేవిని ఎటు తీసుకువెళ్ళాడో చెప్పమని మరీమరీ అడిగాడు. మరణ వేదనను అనుభవిస్తున్న ఆ జటాయువు అతికష్టంగా ప్రయత్నం చేసి ''రామప్రభూ! దుఃఖించకు. రావణాసురుడు విందము అనే ముహూర్తంలో జానకి దేవిని ఎత్తుకుపోయినాడు. ఆ ముహూర్తంలో పోయిన సొమ్ము యజమానికి తప్పకుండా దొరుకుతుంది. అది వాడు ఎరుగడు. నీవు యుద్ధంలో రావణుని జయించి సీతమ్మను తప్పకుండా తెచ్చుకుని హాయిగా ఉంటావు అని విన్నవించాడు. దానికి మాటలు రావడం లేదు. మరణకాలం దగ్గర పడటంవలన నోటివెంట మాంసంతో నెత్తురు కారడం మొదలిట్టింది. ఆఖరి శ్వాస పీలుస్తూ ''ప్రభూ వాడు విశ్వవసుడి పుత్రుడు. సాక్షాత్తు కుబేరుడి తమ్ముడు........'' అంది. రాముడు చేతులు జోడించి ''చెప్పు మిత్రమా చెప్పు'' అని ఆతురతతో అంటున్నాడు. కాని ఆ పక్షి నేలకు ఒరిగిపోయింది.

శ్రీరాముడు దాని కొరకు తీవ్రంగా దుఃఖించినాడు. కన్నులు ఎర్రబడ్డాయి "లక్ష్మణా! రావణుడు సీతను ఎత్తుకు పోయిన దుఃఖంకంటె జటాయువు మరణం నన్ను దహించి వేస్తోంది. ఈతడు దశరథ మహారాజువలె నాకు పూజ్యుడు. నా కోసం మరణించిన ఈ పక్షికి నేనే స్వయంగా దహన సంస్కారం చేస్తాను అని అన్నాడు". లక్ష్మణుడు తెచ్చిన ఎండుకట్టెలపై పక్షిని ఉంచాడు. ఆహితాగ్నులు, యతులు, భూదాతలు పోయే పుణ్యలోకాలకు ఈ జటాయువు పోవాలని కోరుతూ యధావిధిన దహన సంస్కారాలు చేసాడు. స్వర్గానికి పోయేందుకు బ్రాహ్మణులు చదివే పితృదేవతా సంబంధం అయిన మంత్రాలను అన్నింటిని జటాయువు కోసం జపం చేశాడు. కేసరీ మృగాలను చంపి తెచ్చిన మాంసంతో యధావిధిగా పిండ ప్రదానాలు చేశాడు. శాస్త్రప్రకారం రామలక్ష్మణులు గోదావరిలో స్నానం చేసి జటాయువుకు జలతర్పణాలు వదిలారు.

ఒక పతివ్రతను రక్షించుటకు ఆయుధాలు లేనప్పటికి, ఒంటరివాడైననూ, వృద్ధాప్యదశలోను ప్రాణాలను లెక్కచేయక తన ధర్మాన్ని నిర్వర్తించిన జటాయువు దశరథ మహారాజు నోచుకోని అదృష్టాన్ని పొందింది. స్వయంగా శ్రీరాముడే అంత్యక్రియలు నిర్వహించి దానికి మోక్షం ప్రసాదించాడు. కర్తవ్య నిర్వహణంలో మరణం ప్రాప్తించినా అది యోగ హేతువే కదా!



13

## దైవస్తుతి

శ్రీమన్ కృపాజలనిధే కృత సర్వలోక
సర్వజ్ఞ శక్త నతవత్సల సర్వశేషిన్
స్వామిన్ సుశీల సులభాశ్రిత పారిజాత
శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే

## కుమారా!

ధరణీ నాయకు రాణియు
గురురాణియు, నన్నరాణి, కులకాంతను గ
న్న రమణి, దను గన్నదియును
ధర నేవురు తల్లు లమమఁ దలపు గుమారా!

**భావము :** రాజు భార్యయును, గురు భార్యయును, అన్న భార్యయును, అత్తయును, కన్నతల్లియును, ఈ ఐదుగురను తల్లులుగా భావింపవలెను.

★★★★

# రామానుజాచార్యులు

శ్రీ రామానుజులు అదిశేషుని అవతారము. శ్రీమహాపూర్ణులు రామానుజుల అధ్యాత్మిక విద్యా గురువు. అయన రామానుజులకు అనేక గ్రంథములను ఉపదేశించిరి. ఒకనాడు మహాపూర్ణులు ''వత్సా! గోష్ఠిపురమున గోష్ఠి పూర్ణులను వారుకలరు. వారు అత్మజ్ఞానులు మహాపండితులు, నీవు వారి శుశ్రూష చేసి నీ జ్ఞానమును సంపూర్ణము చేసికొనుము'' అని ఆ యతిపతితో నుడివిరి. గురువుగారి అజ్ఞచేత రామానుజులు గోష్ఠిపూర్ణులను దర్శించి భక్తితో సాష్టాంగ దండ ప్రణామము లాచరించిరి, మంత్రార్థములను, ఇతర దుర్లభ పరమార్థ విషయములను బోధింప నాశ్రయించిరి. గోష్టిపూర్ణులు రామానుజుని వినయ సౌజన్య సౌశీల్యములకు మిగుల సంతసించిరి. కాని శిష్యుని అధికారిత్వము తెల్పుకొననిదే ఉపదేశింపరాదన్నది వారి నిర్ణయము. వారు ''నాయనా! ఈ కలికాలమున మంత్రార్థము గ్రహించుటకు తగిన అధికారి కన్పించుట లేదు. అట్టి తఱి నీకెట్లు ఉపదేశింపగలను'' అని పలికిరి. రామామజులు హతాశులైరి.

రామానుజులకు మంత్రార్థమును గ్రహించవలెనన్న కోరిక సడలలేదు. పట్టుదలతో పాదచారులై పదునెనిమిదీ, ఇరువదిసార్లు గోష్ఠిపూర్ణులను దర్శించిరి. ప్రతిసారి వారు ఏదో ఒక సాకుతో మంత్ర ముపదేశము చేయక పంపివేయుచుండిరి. రామానుజులకు దుఃఖము కలిగెను. ఎంత ప్రయత్నించిననూ తమ కోరిక తీరనందులకు వారు తన దురదృష్టమును నిందించుకొనుచు నిద్రాహారములను కూడ విసర్జించిరి. నిరాహారియై వారు శ్రీరంగేశుని స్మరించుచుండిరి. ఈ విషయము దేశమందెల్లడను వ్యాపించెను. గోష్ఠిపూర్ణులకు కూడ ఈ వార్త చేరినది. వారు రామానుజుల దృఢదీక్షను అర్హతను గ్రహించి మంత్రోపదేశము పొందుటకు రమ్మని రామానుజులకు వార్త నంపిరి. ఈ వార్త అందగనే రామానుజులు అనందముతో పొంగిపోయిరి.

గోష్ఠిపూర్ణులు రామానుజయతిని సాదరముగా స్వీకరించి ఏకాంతమునకు గొనిపోయిరి. ఉపదేశించబోవు శ్రీనారాయణాష్టాక్షరీ మంత్రరాజముయొక్క విశిష్టతను చెప్పి ''రామానుజా! ఈ మంత్రరాజమును పొందిన వారికి కైవల్యము కరతలామలకము. అన్యులకు నీవు ఈ మంత్ర ముపదేశించరాదు'' అని కట్టడి చేసి దానిని పాలించుటకు రామానుజులచే బహువిధ శపథములు చేయించి నారాయణాక్షరీ మహామంత్రమును అర్థసహితముగా నుపదేశించిరి. రామానుజులు గోష్ఠిపూర్ణులను పూసతోను, గురుదక్షిణతోను సత్కరించిరి.

మంత్రప్రాప్తిచే రామానుజుల హృదయము మరింత విశాలమైనది. జన్మ జరామరణాదులచే దుఃఖితులైన ప్రజల ఎడ వారికి అపారమైన జాలి కలిగి వారికి ముక్తిమార్గము ఉపదేశించవలెనన్న కోరిక ప్రబలమయ్యెను. 'గు' అనగా అంధకారము 'రు' అనగా అడ్డగించువాడు. ప్రజలను అజ్ఞానాంధకారము నుండి రక్షించుటకు తాము పొందిన పరమార్థ జ్ఞానమును ఇతరుల కెరుక పర్చుటకు నిశ్చయించుకొనిరి. తాము గోష్ఠిపూర్ణులవద్ద చేసిన ప్రతిజ్ఞలను లెక్కచేయక వెంటనే రామానుజులు ఆ నగరమందలి నరసింహస్వామి ఆలయమునకు వెళ్ళిరి. ఆ ఆలయ గోపురశిఖర మెక్కి ఉచ్చైః స్వరముతో ''అజ్ఞానకారణమున పాపమున కొడిగట్టుచున్న ఓ సోదరులారా ! రండు రండు ! స్వర్గధామమును మీకు కరతలా మలకము జేయు మహామంత్రరాజమును నేను మీ కిదే చెప్పుచున్నాను'' అని ప్రజలందరను పిలిచి శ్రీమన్నారాయణ మహామంత్ర ముపదేశించిరి. నాటినుండి వారు ఆచార్య శబ్ద సార్థక నామధేయులైరి.

గోష్ఠిపూర్ణులకు ఈ విషయం తెలిసి పరుగు పరుగున రామానుజుల వద్దకు వచ్చి ''శిష్యా! నీవు ఎట్టి గురుద్రోహ మొనరించితివో ఎరుగుదువా? గురుద్రోహమున కెట్టి దుష్ఫలమో తెలిసియే ఇట్లు చేసితివా?'' అని క్రోధముతో పలికిరి. ఏ మాత్రము జంకు లేక వినయముగా రామానుజులు ''స్వామీ ! గురుద్రోహమునకు ఘోరనరకమే గతియని నే నెరుగుదును. కాని నా గురుద్రోహ కార్యమువలన అనేకులు తరించి స్వర్గమును జేరుచుండగా నేనొక్కడను నరకమందు బడిననేమి? అందువలన నేను ఈ సాహసమునకు పాల్పడితిని'' అని సమాధానమిచ్చిరి. రామానుజుల సమాధానము గోష్ఠిపూర్ణులకు మహదానందము కల్గించినది. శిష్యుని ప్రేమాతగ కౌగిలించుకుని ఆనంద బాష్పములు రాలగ రామానుజుల పరహిత కాంక్షను వారు మెచ్చుకొనిరి.

సత్పురుషులు తమ శ్రేయస్సును లెక్కచేయకసదా పరహితమునే కోరుదురు.



## 14

## దైవస్తుతి

నిత్యానందకరి వరాభయకరి సౌందర్య రత్నాకరి
నిరూతాఖిల ఘోరపావనకరి ప్రత్యక్ష మాహేశ్వరి.
ప్రాలేయాచల వంశపావనకరి కాశీపురాధీశ్వరి
భిక్షాం దేహి కృపావలంబనకరి మాతాన్నపూర్ణేశ్వరి.

## కుమారా!

ఆచార్యున కెదిరింపకు,
ప్రోచిన దొర నిందసేయఁ బోకుము, కార్యా
లోచనము లొంటిఁ జేయకు
మాచారము విడువఁ బోకుమయ్య! కుమారా!

భావము : ఉపాధ్యాయుని ఎదురింప రాదు. నిన్ను కాపాడిన వారిని నిందింపకుము. ఏదైనను ఆలోచనము నొంటరిగా చేయబోకుము. మంచి నడవడిని వదలి పెట్టకుము.

★★★★

# ప్రయాగ మహిమ

పూర్వకాలమందు వేద వేదాంగ తత్త్వవేది అయిన విప్రుడు ఒకడు ఉండేవాడు. నియమ నిష్ఠలతో తన జీవితం గడుపుతున్న ఆ బ్రాహ్మణుడు అగర్భ దరిద్రుడు. దానికి తోడు గంపెడు సంతానము. ఆయన భార్య జ్ఞానవిహీన. పైన రాక్షసి. అతడు తిరగని వూరు లేదు; అడగని మనిషి లేడు. భార్యా బిడ్డలను పోషించడానికై మార్గం కనిపించక ఆ విప్రుడు మిక్కిలి కృశించి పోయాడు. ఒక రోజున "తిన తిండి లేని ఈ జీవిత మెందులకు? శరీరంలో శక్తి ఉన్నంత కాలము జీవన భారం మోయగలిగాను. ఇప్పుడు తల నెరిసింది." అని భావించి మోక్షసాధనకై పాపనాశినియైన కాశీనగరానికి వెళ్ళాడు. సకల ప్రాణుల పాపములను తొలగించే పవిత్ర గంగానదిలో స్నానం చేసి, విశ్వేశ్వరుణ్ణి పూజించుకొన్నాడు. నిత్యము గంగా జలాలలో స్నానాదులను పూర్తిచేసుకొని, కాశీ నగరంలో ఉన్న శైవ వైష్ణవాలయాలన్నింటిని సందర్శించేవాడు. ఇట్లా కొంత కాలం గడిచింది.

ఒకనాడు "అయ్యో! ఈ కాశీ పట్టణంలో వచ్చిపడ్డాను. మరణ సమయమందుగాని కాశీలో సిద్ధి కలుగదు. ఇంతా చేస్తే ఇక్కడ చర్మ వస్త్రాలూ, పునుక పేరు, భూత సంగమము, కపాల పాత్ర, భిక్షాటనము తప్ప నాకు లభించేది ఏమి ఉన్నది? ఇంత దూరము వచ్చి నీచమునకు నోచుకోవడానికి బదులు ఇంకా ఎక్కడికైనా వెళ్ళడం సముచితం." అనుకొని, ఆ విప్రుడు ప్రయాగక్షేత్రానికి చేరుకున్నాడు.

పరమ పవిత్రమైన ప్రయాగక్షేత్రం చూచి "ఆహా! అశ్వమేధ యాగం చేసినవానికి, బ్రహ్మహత్య చేసినవానికి ఇరువురికి సద్గతులు కల్పించే క్షేత్రరాజ మిది. అన్యతీర్థములు ప్రయాగ క్షేత్రమునకు సాటిరావు." అని బహు విధముల ప్రస్తుతించి గంగా యమునా సంగమంలో కృతస్నాతుడై ప్రయాగ మాధవుణ్ణి భక్తిమీర సేవించినాడు. నిత్యము మాధవుని నామమే స్మరించుచు, విష్ణుగాథలు వినుచు, విష్ణు దర్శనము చేయుచు ఆ విప్రుడు వేడుకతో కాలము గడుపుచుండెను.

ఇట్లుండగా ఒకనాడు ఆ విప్రుడు గంగానదిలో స్నానము చేయుచుండ నలుగురు కాంతలు మరణోద్యోగమునకు సంకల్పమును చెప్పుకొనుచుండిరి. మొదటి స్త్రీ బంగారు రాసులు, మణులు, ధన ధాన్యరాసులు కలిగి, దాతయు

భోక్తయు అయినవాడు వచ్చే జన్మలో భర్త కావలెనని వచించెను. రెండవ కాంత సమస్త కళావిశారదుడై ఉచితజ్ఞుడని ప్రఖ్యాతి పొందిన శారదాస్వరూపుడు భర్త కావలయునని కోరుకొనెను. మూడవ భామిని సుందర స్వరూపుడు, పరాక్రమధనుడైన రాజు భర్త కావలయునని పలికెను. నాల్గవ కాంత బంగారపు ముక్కవంటి శరీర కాంతి కలిగి కామ కళా ప్రవీణుడైనవాడు తన పతి కావలెనని కోరుకొనెను. ఇట్లు ఆ నలువురు నాగకన్యలు సంకల్పమును చెప్పుకొని ఆ నదీజలాలలో మునిగారు.

స్నానార్థమై వచ్చిన విప్రుడు ప్రయాగ మాధవుని తలచి నమస్కరించుచు ఆ నలువురను నాకు భార్యలుగా ప్రసాదింపుమని ప్రార్థించి ప్రయాగ గుండములో మునిగెను. ప్రయాగ మాధవుని కరుణా విశేషముచే పద్మావతీ సూర్యకాంతుల కుమారుడుగా ఉద్భవించి భోజుడని ప్రసిద్ధి చెందెను. ఆ నలువురు అంగనామణులు సుగంధి, పద్మగంధి కనకవతి చంద్రప్రభ అనే నామములతో ఆతనికి భార్యలైరి. ఈ విధముగా దుర్భర దారిద్ర్యమును అనుభవించిన విప్రుడు ప్రయాగ తీర్థ మహత్త్వము వలన వివిధ విభవ విలసితుడై అత్యంత రూపసంపన్నుడై సకల కళాప్రవీణుడై లాట దేశమునందు ధారా నగరమునకు చక్రవర్తియై పెక్కు సంవత్సరములు రాజ్యము చేసెను.

పవిత్ర భారతభూమిలో ప్రయాగవంటి క్షేత్రములు సహస్రాధికములు. వాటిని దర్శించి తరించుట వివేకుల లక్షణము.

★ ★ ★ ★

# 15

## దైవస్తుతి

గంగా తరంగ కమనీయ జటాకలాపం
గౌరీ నిరంతర విభూషిత వామభాగమ్
నారాయణప్రియ మనంగ మదాపహారం
వారాణసీ పురపతిం భజ విశ్వనాథమ్

## కుమారా!

చేయకుము కాని కార్యము;
పాయకుము మఱిన్ శుభం; బవని భోజనమున్
జేయకుము రిపు గృహంబునఁ,
గూయకు మొరు మనసు నొచ్చుఁ గూఁత, కుమారా!

**భావము :** కుమారా! చేయరాని పని చేయకుము. మంచిదానిని వదలకుము. పగవాని ఇంటిలో భోజనము చేయకుము. ఇతరుల మనసునకు నొప్పి కలుగునట్లు మాట్లాడకుము.

★★★★

# ధ్రువుడు

ఉత్తానపాదుడను రాజునకు సునీతి, సురుచి అను ఇద్దరు భార్యలు కలరు. ఉత్తానపాదునకు సురుచి యందు అభిమానము, ప్రేమ ఎక్కువ. ఎల్లప్పుడు ఆమెకు ఇష్టమైన రీతిగా సంచరించేవాడు. ఒకనాడు ఉత్తానపాదుడు సింహాసనం మీద కూర్చుని ఉండగా సురుచి ప్రక్కగా నిలబడి ఉండెను. అప్పుడు ఉత్తముడు, ధ్రువుడు తండ్రివద్దకు వెళ్ళారు. ఉత్తముడు ముందు తండ్రి తొడపై కూర్చుండగా ఉత్తానపాదుడు అతనిని ముద్దుపెట్టుకొనెను. ధ్రువుడు కూడ తండ్రి తొడపై కూర్చుండుటకు ముందుకు వెళ్ళారు. అప్పుడు ప్రక్కనే ఉన్న సురుచి ధ్రువుని ప్రక్కకు లాగి వేసింది. నా కుమారుని వలె తండ్రి తొడపై కూర్చునే అదృష్టం నీకు లేదు. ఆ అదృష్టం కొరకు నీవు శ్రీహరిని ప్రార్థించు పో! అన్నది. ఉత్తానపాదుడు మౌనంగా ఊరు కున్నారు. సవతి తల్లి చేసిన అవమానం, తండ్రి ఉదాసీనంగా ఉండటం, ఐదు సంవత్సరాలు వయస్సుగల ధ్రువునకు చాల బాధ కల్గించాయి.

ధ్రువుడు ఏడుస్తూ తన తల్లియైన సునీతి వద్దకు వెళ్ళాడు. ఏడుస్తూ వచ్చిన కుమారుని సునీతి తన తొడపై కూర్చుండ బెట్టుకుని ఓదార్చింది. ధ్రువుడు జరిగిన విషయమంతా తల్లికి చెప్పాడు. "నాయనా! నీవు నా తొడపై కూర్చున్నావు గదా! ఇంక ఎందుకు విచారం" అంటూ ఓదార్చింది. కాని సురుచియొక్క ప్రవర్తన తననే అవమానించినట్లు గుర్తించింది. భర్తమౌనం ఆమెకు మరీ అవమానం కల్గించింది. నిట్టూర్పుతో ఆమె "నాయనా ధ్రువా! నీవు నా కడుపున పుట్టుటవల్ల తండ్రి తొడపై ఉత్తమునితో సమానంగా కూర్చుండుటకు నోచుకోలేదయ్యా! అంది. ఆమె మాటలలో ఆమె హృదయక్షోభ ధ్వనిస్తోంది. అంతట ధృవుడు తన తండ్రి తొడపైననే కూర్చువాలని పట్టుపట్టాడు. అది సాధించుట సునీతివల్ల గాదు. అందులకు ఆమె ధ్రువుని వీపు ప్రేమతో నివురుతూ "కుమారా! నీ కోరిక నెరవేరుటకు ఒకటే మార్గం. నీవు శ్రీహరిని గూర్చి ప్రార్థన చేయుము" అని చెప్పింది. తన సవతి తల్లి, తన తల్లి ఇద్దరూ ఒకే విధంగా చెప్పారు. అదే నిజమైన మార్గం. కాన ఆ విధంగానే చేయుటకు ధ్రువుడు నిశ్చయించుకున్నాడు. వెంటనే లేచి తల్లిపాదాలకు నమస్కరించాడు. సునీతి అతనిని ఆశీర్వదించింది. ధ్రువుడు తపస్సుకై అడవులకు వెళ్ళాడు.

దారిలో నారదుడు ఎదురైనాడు. నారదమహర్షికి ధ్రువుడు నమస్కారం చేశాడు. నారదుడు ధ్రువుని కుశల ప్రశ్నలు వేసి అడవులకు వెళ్ళుచున్న కారణము అడిగి తెల్సుకున్నాడు. అంత నారదుడు ''నాయనా ధ్రువా! తపస్సు అంటే ఆటలు కాదు. అంతఃపురంలో సుఖంగా ఉండడం కాదు. ఇది చాల కష్టమైనది, అనేక బాధలతో కూడుకున్నది'' అని తపస్సు మాన్పించుటకు ప్రయత్నము చేశాడు. మీ తండ్రికి చెప్పి అతని తొడపై కూర్చుండ బెడతానని చెప్పాడు. కాని ధ్రువుడు తన పట్టుదల వదలలేదు. తపస్సే చేయాలన్నాడు. అప్పుడు నారదుడు అతనికి వాసుదేవ మంత్రము ఉపదేశించి యమునా తీరంలో గల మధువనం తపస్సుకు వీలుగా ఉంటుంది. అక్కడకు వెళ్ళవలసినదని చెప్పి పంపాడు.

నారదుడు చెప్పినట్లుగా ధ్రువుడు మధువనం చేరాడు. యమునా నదిలో స్నానం చేసి తపస్సు ప్రారంభించాడు. కొంతకాలం నెలకు ఒకసారి ఆహారంతోను తరువాత ఆహారం బదులు నీరు త్రాగుతూ, తర్వాత గాలినే ఆహారంగా తీసుకుంటూ కఠోరంగా తపస్సు చేశాడు. ఆ తపస్సుకు మూడు లోకాలు తల్లడిల్లి పోయాయి. దేవతలు, లోకపాలురు శ్రీహరి వద్దకు వెళ్ళి మొరపెట్టుకున్నారు. శ్రీహరి ధ్రువునకు ప్రత్యక్షమైనాడు. ధ్రువుడు మాట్లాడలేక పోయినాడు. అంత విష్ణుమూర్తి శంఖంతో ధ్రువుని తాకగా, ధ్రువుడు శ్రీహరిని స్తుతించాడు. శ్రీహరి సంతసించి ఉత్తానపాదుడు ధ్రువుని రాజుగా చేయునని, ధ్రువుడు ఆరువేల సంవత్సరాలు రాజ్యం చేసి జీవితాంతమందు అంతరిక్షమందు స్థానము పొందునట్లుగా వరము లిచ్చెను. తన పట్టుదల వలన ధ్రువుడు అంతటి ఉత్కృష్ట స్థానమును పొందెను. పట్టుదలతో కష్టాలను లెక్కచేయక కృషి చేస్తే మనం కూడా ధ్రువుని వలె ఎంతటి అసాధ్యమైన లక్ష్యాన్నైనా సాధించవచ్చు.

★ ★ ★ ★

## 16

# భాగవతస్తుతి

ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుక శౌనక భీష్మ దాల్భ్యాన్
రుక్మాంగదార్జున వశిష్ఠ విభీషణాదీన్
పుణ్యాన్ ఇమాన్ పరమ భాగవతాన్ స్మరామి

## కుమారా!

జగడంబు లాడు చోటను,
మగువలు వసియించు చోట, మదగజము దరిన్
పగతుండు తిరుగుచోటను
మగిడి చనఁగ వలయుఁ జలము మాని, కుమారా!

**భావము :** కొట్లాటలు జరుగుచుండు చోటను, ఆడవారుండు చోటను, మదించిన ఏనుగునకు దగ్గరగాను, శత్రువులు తిరుగు చోట్లయందును 'నా కేమిలే' యని అహంకారముతో నిలువరాదు. త్వరగా అట్టి ప్రదేశములనుండి కదలి వెళ్ళవలయును.

★★★★

## అంబరీషుడు

అంబరీషుడు నాభాగ మహారాజు కుమారుడు. సప్తద్వీపాలను పరిపాలించాడు. పరమ భాగవతోత్తముడు. హరి భక్తుడయ్యీ రాచకార్యములందు గాఢ శ్రద్ధతో ఉండేవాడు. అనేక అశ్వమేధ యాగములు చేశాడు. అతని భక్తికి మెచ్చి శ్రీహరి అతని రక్షణార్థము చక్ర మొకదానిని ప్రసాదించెను.

అంబరీషుడు విష్ణు ప్రియమైన ఏకాదశి వ్రతమును ఒక సంవత్సర కాల మాచరించాడు. వ్రతమును సమాప్తి చేయుటకు మూడు రోజులు ఉపవాసం చేశాడు. ద్వాదశి రోజు ఉదయాన పారణము చేయాలి. అంబరీషుడు ఆ ప్రయత్నంలో అనేక మంది బ్రాహ్మణోత్తములను ఆహ్వానించాడు. ఇంతలో దుర్వాసమహర్షి శిష్యులతో అంబరీషుని గృహమునకు వచ్చాడు. ఆనందంతో అంబరీషుడు అతిథి పూజచేసి తన అతిథ్యాన్ని స్వీకరించమని ప్రార్థించాడు. దూర్వాసమహర్షి అందులకు అంగీకరించి స్నానార్థం శిష్యులతో నదికి వెళ్ళాడు. ఎంతకాలం గడచినా దుర్వాస ముని తిరిగి రాలేదు. ద్వాదశి ఘడియలలో పారణము పూర్తి చేయాలి. ఇప్పుడు తాను పారణము చేసినచో మునిని తిరస్కరించినట్లగును. అసలే ఆయన కోపిష్టి. ముని వచ్చువరకు వేచియుండినచో సకాలంలో పారణ చేయని దోషం తనకు వస్తుంది. అంబరీషునకు ఈ విషమావస్థలో ఏమి చేయుటకు తోచలేదు. అంతట అంబరీషుడు అచటనున్న పండితులను తనకు కల్గిన చిక్కును తొలగించవల్సినదిగా కోరాడు. వారు ధర్మాధర్మములు విచారించి విష్ణు ప్రీతికరమైన తులసీదళంతో సలిల భక్షణము దోష రహితమనియు, వ్రత ఫలము సిద్ధించుననియు చెప్పిరి. వారి ఆజ్ఞానుసారము అంబరీముడు జలపానము చేసెను.

ఇంతలో దుర్వాసు మహర్షి శిష్యసమేతంగా తిరిగివిచ్చేశాడు. జరిగిన సంగతి గ్రహించాడు. ఆయన కళ్ళు చింతనిప్పులవలె మెరశాయి. ఆగ్రహంతో పళ్ళు పటపట కొరకుచూ ''అంబరీషా! నన్ను ఆతిథ్యానికి పిలిచి అవమానిస్తావా? అందుకు తగిన ప్రతిఫలం అనుభవించు'' అంటూ తన శిరము నుండి ఒక జడను పెరికి నేలపై కొట్టాడు. వెంటనే ఒక మహాశక్తి ఆవిర్భవించి అంబరీషునిపైకి వచ్చింది. అంబరీషుడు చెప్పే మాటలను దుర్వాసుడు వినిపించుకోలేదు. మరో మార్గం తోచక అంబరీషుడు శ్రీహరిని ప్రార్థించాడు. అంత శ్రీహరి ప్రదానం చేసిన చక్రం ప్రత్యక్షమై శక్తిని హరించింది. అంతటితో ఆగక ఆ చక్రం దుర్వాసునిపైకి వెళ్ళింది.

అప్పుడా మునిపుంగవుడు ఎటు పోయిననూ చక్రమాతని వెంబడించుచుండెను. బ్రహ్మ వద్దకు పోయి తనను రక్షించమని ప్రార్థించాడు. చక్రమును వారించుట తనవల్ల గాదన్నాడు. బ్రహ్మ శంకరుని వద్దకు వెళ్ళగా దుర్వాసుని రక్షించుటకు తనకు శక్తి లేదని శంకరుడు చెప్పెను. దుర్వాసుడు వైకుంఠమునకు పరుగిడి విష్ణుమూర్తిని శరణు వేడెను. విష్ణువు కూడ ''నేను నిన్ను రక్షింపజాలను. నీవు అంబరీషునే శరణు కోరుమని'' చెప్పెను. శ్రీహరికి అంబరీషుడు అంత ఆత్మీయుడని దుర్వాసుడు గ్రహించలేదు. వెంటనే దుర్వాసుడు అంబరీషుని శరణు వేడాడు. అంబరీషుడు ముని ఎద ఎట్టి కార్పణ్యమూలేక శ్రీహరిని ప్రార్థించగా చక్రము అంతర్ధానమయ్యెను.

భగవంతుడు భక్తులకు సర్వదా వశ్యుడు. భక్త రక్షణమును శ్రీహరియే వహించును.

★ ★ ★ ★

గతే శోకో న కర్తవ్యః భవిష్యం నైవ చిన్తయేత్,
వర్తమానేన కాలేన వర్తయన్తి విచక్షణాః.

★ ★ ★ ★

## దైవస్తుతి

సరస్వతి మహాభాగే
విద్యే కమల లోచనే
విద్యారూపే విశాలక్షి
విద్యాం దేహి నమోస్తుతే

## కుమారా!

పెను కోపము, గర్వము, మ
ఖ్ఖను, చపలము, దురభిమానమును, వ్యాపారం
బునఁ గోరక యువికియును న
ల్పుని గుణము లటంచుఁ దెలిసి కొందు, కుమారా!

**భావము :** కుమారా! ఎక్కువ కోపము కలిగి వుండుటయును, గర్వపడుటయును, పొంగిపోవుటయు, చపలత్వము, తనను మించిన వాడు లేడను దురభిమానమును కలిగి వుండుటయును, సోమరి తనమును అనునవి నీచుని గుణములు. వీనిని తెలిసికొని వివేకముతో మెలగవలయును.

★★★★

# ధర్మరాజు

శ్రీకృష్ణదేవుని కృపాబలంతో పాండవులకు రాజ్యలక్ష్మి దక్కింది. కౌరవులు అధర్మమును పాటించి పరాజితులై నశించారు. ధర్మరాజు పట్టాభిషిక్తుడై చాలాకాలం రాజ్యపాలన సాగించాడు. అశ్వమేధ యాగములు చేశాడు. ఒకనాడు తమ సారధి, సచివుడు, బాంధవుడైన వాసుదేవుడు, బలరాముడు తమ అవతారం చాలించారని విన్నాడు. ధర్మరాజునకు జీవితం మీద విరక్తి కల్గింది.

మరునాడే ధర్మరాజు కొలువు దీర్చి పౌర జానపదులను చూస్తూ "ఆర్యులారా! వాన ప్రస్థానికి అనుజ్ఞ నివ్వండి. మా మనుమడైన పరీక్షిత్తునకు రాజ్యభారము అప్పగించుతాను. మీరు మా మీద చూపిన ఆదరాభిమానాలే వాని ఎడ చూపి మా వంశ ప్రతిష్ఠను కాపాడండి. కృపాచార్యులు వానికి గురువులు" అని ప్రకటించాడు. పౌరులందరు విషాదమంది దుఃఖించారు. ధర్మరాజు వారందరిని ఓదార్చాడు పాండవులు, వారి వెంట ద్రౌపది - రాజ భవనం వదలి నడుస్తున్నారు. వారి వెనుక ఎక్కడిదో ఒక శునకం కూడ నడువ సాగింది. వారు నడచి.............. అలా నడచి బాగీరధి వద్దకు చేరారు. అక్కడ అగ్నిదేవుడు ప్రత్యక్షమై "పార్థా! దేవ కార్యార్థమై ఈ గాండీవం వరుణుని వద్ద నుండి తేబడింది. ఇక దీనిని ఆయనకు అంద జేయాలి" అనడంతో అర్జునుడు నమస్కరించి గాండీవాన్ని గంగలో విడిచాడు. అనంతరం వారు నడక సాగించారు. వారి వెనుక ఆ శునకం కూడ అలా నడచి వెళుతూనే వుంది.

ఆ విధంగా వారు సాగి సాగి హిమాలయాలు దాటి మేరుగిరి సమీపానికి యోగనిష్ఠలో వెళ్ళారు. నిష్ఠ చాలక భూమి మీద వాలిపోయింది పాంచాలి. ఆమెను భీముడు చూచి "ధర్మనందనా! ఈమె ఎన్నడు ధర్మగ్లాని ఎరుగదు గదా! ఎందుకిలా అయింది" అన్నాడు. "నాయనా! భర్తలందరూ ఆమెకు సములైనా అర్జునుని మీద కొంత పక్షపాతం ఉంది." అన్నాడు ధర్మజుడు. కొంత నడిచేసరికి సహదేవుడు పతనమయ్యాడు. అప్పుడు భీముని చూచి ధర్మరాజు "వీడికి తనంత వాడు లేడనే అహంకారం లేశంగా వుంది." అని ముందుకు నడిచాడు. అనంతరం నకులుడు పడగా "నాయనా! తనంతటి సుందరుడు భువనంలో లేడనే అహంకారం వీడికి ఉన్నది." అంటూ అడుగులు వేశాడు. ఈసారి వంతు అర్జునుని దైనది, అది చూచి "భీమసేనా! వీడు కౌరవులందరని ఒక్కరోజులో నశింపజేస్తానని ఆ మాట నిలుపుకోలేదు. అంతేకాక ధనుర్ధారులలో తనంటి వాడు లేడనే అహంకారం

విడికెక్కువ'' అంటూ ముందుకు సాగాడు. కొంతదూరం సాగి భీముడు నేల వాలుతూ, అన్నయ్యా! అనగా ''నాయనా! భోజన ప్రీతితోను, దాని వలన వచ్చిన క్రోధ అహంకారములే నిన్నీ దశకు తెచ్చాయి'' అంటూ ముందుకు సాగాడు. శునకం మాత్రం ధర్మరాజును అనుసరిస్తూనే ఉంది.

కొంతదూరం వెళ్ళేసరికి ఇంద్రుడు రథంతో ఎదురువచ్చి ''ధర్మనందనా! ఈ రథం ఎక్కి అమరలోకం చేరు. నీ తమ్ములు, భార్య అప్పుడే అమరలోకం చేరారు'' అని చెప్పాడు. ''మహేంద్రా! హస్తినాపురి నుండి నా వెంట యీ సారమేయం వస్తోంది. ఈ యాత్రలో నా భార్యా సోదరులు నాతో రాలేకపోయినా ఇది నన్ను విడువలేదు. కాన దీనిని కూడ రథం ఎక్కించాలి'' అన్నాడు ధర్మరాజు. జంతువుకు అమరలోక దర్శనమా అని ఇంద్రుడు నవ్వాడు. తనతో వచ్చే జంతువును విడవడం ధర్మం గాదని పట్టుపట్టాడు. ధర్మరాజు. ఎంత చెప్పినా శునకాన్ని విడిచి రానన్న ధర్మరాజుని చూచి ప్రసన్న హృదయుడై శునక రూపంలో ఉన్న యమధర్మరాజు ''కౌంతేయా! నీ సర్వభూత సమదృష్టి, ధర్మనిరతి నాకు సంతోషాన్ని కల్గించాయి. అమరేంద్రునితో స్వర్గానికి వెళ్ళు'' అన్నాడు.

ధర్మరాజు ధర్మదృష్టి మనకు అనుసరణీయము.

★★★★

**అమంత్ర మక్షరం నాస్తి నాస్తి మూల మనౌషధమ్,**
**అ యోగ్యః పురుషో నాస్తి యోజకస్తత్ర దుర్లభః**

★★★★

## 18

## దైవస్తుతి

కస్తూరి తిలకం లలాట ఫలకే వక్షః స్థలే కౌస్తుభం
నాసాగ్రే నవమౌక్తికం కరతలే వేణుం కరే కంకణమ్
సర్వాంగే హరి చందనం చ కలయన్ కంఠేచ ముక్తావళిం
గోపస్త్రీ పరివేష్టితో విజయతే గోపాల చూడామణిః.

## కుమారా!

జారులతోఁ జోరులతోఁ
గ్రూరులతో నెప్పుడు పొత్తుఁ గోరక మది స
త్పూరుష పదాంబుజాతా
ధారుడవై బ్రతుకుము; కీర్తి తనరుఁ గుమారా!

భావము : కుమారా! అంతు బుద్ధి గలవారితోడను, దొంగలతోడను, కఠిన హృదయులతోడను ఎప్పుడు స్నేహము చేయరాదు. మనస్సులో ఎప్పుడును సజ్జనుల పాదసేవ చేయుటయే ముఖ్యముగా నెంచుకొని జీవింపుము. దాని వలన సత్కీర్తి వచ్చును.

★★★★

# తులసీదాసు

ఆత్మరామ్ ఒక బీద బ్రాహ్మణ కుటుంబీకుడు. అతని భార్య హులసి. దారిద్ర్యంలో ఆత్మరామునకు అతని భార్యయే ఒక సంతృప్తి. వారికి జన్మించిన బాలునికి జన్మ సమయమందే దంతములున్నాయి. అట్లు జన్మించుట మాతా పితరులకు గండమని జ్యోతిష్కులు చెప్పారు. వారన్నట్లే అనతి కాలంలో బాలుని తల్లి హులసి మరణించింది. ఆమె మరణంతో ఆత్మారామ్ కృంగిపోయాడు. ఈ పిల్లవాడంటే అతనికి అనురక్తి, ప్రేమ క్రమంగా తగ్గింది. ఇరుగు పొరుగువారి సహాయంతో ఆ పిల్లవాడు పెరిగాడు. కాని ఆ అభాగ్యుడు ప్రేమ ఆదరాలకు ఏ మాత్రం నోచుకోలేదు.

ఒక నాడు ఆ గ్రామానికి సన్యాసులు కొంతమంది వచ్చారు. వారిలో ఒకడు బాలుడైన తులసీదాసుని ఆప్యాయంగా పలుకరించాడు. అంతే తులసీదాసు వాని వెంట ప్రయాణమైనాడు. వారు కాశీ చేరారు. అక్కడ ఒక పండితుని వద్దకు తీసుకు వెళ్ళి ఆ సన్యాసి తులసీదాసును అతనికి వప్పగించి విద్యాబుద్ధులు గరపమని కోరాడు. సజ్జనుడైన ఆ పండితుడు తన కుమారునితో తులసీదాసుకు విద్యను బోధించాడు. సూక్ష్మగ్రాహియైన తులసీదాసు అతని వద్ద సంస్కృతమును చక్కగా అభ్యసించాడు. చిన్ననాటినుండి బీజ రూపంగా అతనిలోనున్న రామభక్తి మొలకెత్త నారంభించింది. తులసీదాసుకు ఆ ఇంటిలోని వారందరూ ఎంతో ఆదరంతో చూడసాగారు. అతని స్నేహశీలతకు, సచ్ఛీలమునకు సూక్ష్మబుద్ధికి సంతసించి ఆ పండితుడు తన కుమార్తె రత్నావళిని తులసీదాసున కిచ్చి వివాహం చేసాడు.

రత్నావళి సౌందర్యవతి. శ్రీరాముని ఎడ భక్తి భావం గలది. భర్తను ప్రేమగా లాలించేది. ప్రేమంటే చిన్ననాటి నుండి ఎరుగని తులసీదాసు హృదయం పరవళ్ళు త్రొక్కింది. ఆమె అతని ఆరాధ్య దేవత. ఆమెను విడిచి ఉండలేడు. ఒక నాడు తులసీదాసు మిత్రులతో విహారం వెళ్ళాడు. అదే సమయంలో రత్నావళి సోదరుడు వచ్చి ఆమెను తన ఊరు రమ్మన్నాడు. సన్నిహిత పరిచయం వలన అతని అనుమతికై వేచియుండక అతనికి ఒక జాబు వ్రాసి ఉంచి రత్నావళిని తన వెంట తీసుకువెళ్ళాడు. ఆనాటి సాయంత్రం ప్రొద్దుపోయిన తర్వాత తులసీదాసు ఇంటికి చేరాడు. భార్య ఇంటియందు లేదు. జాబు చూచుకున్నాడు. ఇంటివద్ద తానున్నచో ఆమెను పంపకుండెడివాడు. ఆమె లేని ఇల్లు అతనికి దుర్భరం. వెంటనే అతను కూడా బయల్దేరాడు. మార్గమంతా చీకటి. మార్గమధ్యం చేరేసరికి చీకటికి తోడుగా

గాలివాన ప్రారంభమైనది. పొదల ముళ్ళతో శరీరం గీచుకుపోయింది. బట్టలు తడిసిపోయాయి. బురదలో పడుతూ లేస్తూ గ్రామం చేరాడు. బావ మరిది ఇంటివద్దకు వెళ్ళగా తలుపులు వేసి ఉన్నవి. అందరూ గాఢ నిద్రలో నున్నారు. అందరి నిద్రా భంగము చేయుట కాతని మనస్సు అంగీకరించ లేదు. రత్నావళి నిద్రించు గది అతడెరుగును. ఆ గది సమీపంగానున్న ప్రహరీగోడ వద్దకు చేరుకున్నాడు. అచట వ్రేలాడుచున్న తాడువంటిదానిని ఊతంగా అతడు ప్రహరీగోడ దుమికి తలుపు తట్టాడు. రత్నావళి తలుపు తెరచి భర్తను చూచి చకితురాలైంది. "ఈ రాత్రివేళ గాలివానలో ఇక్కడకు వచ్చారా? లోపలకు ఎట్లా వచ్చారు?" అని ప్రశ్నించింది. ఆ ప్రశ్నలోని ఈసడింపు, వ్యంగ్యము అర్థమై అతని మనస్సు చివుక్కుమన్నది. తన [illegible] ప్రాణంగా చూచుకుంటున్న తన భార్య అన్న మాటలకు అతని హృదయం గాయమైంది. ఐనప్పటికీ "ప్రేయసీ! నా ఆగమనాభిలాషియే గదా నీవు ప్రహరీ గోడవద్ద తాడును ఏర్పాటు చేసింది?" అని ప్రశ్నించాడు. ఆమెకు ఆ మాటలు అర్థం కాలేదు. ఇద్దరు దీపం తీసుకుని గోడవద్దకు వెళ్ళి చూచారు. ఆ వ్రేలాడునది తాడు గాదు - త్రాచుపాము. అతడు మ్రాన్పడిపోయాడు. పొడి వస్త్రములు ధరించిన తర్వాత ఆమె అతనిని సుఖాసీనుని చేసి - "స్వామీ! నా పై మీరు చూపిన ప్రేమలో ఒక వంతైనా జగద్రక్షకుడైన ఆ శ్రీరామచంద్ర ప్రభువుఁ ఎడ చూపినచో మీరు ఈ సంసార సాగరమును తరించెడివారు. నా జీవితము కూడ ధన్యమయ్యెడిది కదా! ఆ స్వామి కృపవలననే మీరు ఇంకనూ సజీవులైయున్నారు." అని నుడివెను. ఈ హిత వాక్యములు పల్కునపుడు రత్నావళి అతనికి సాక్షాత్తు జగన్మాతగా గోచరించింది. ఆ మాటలు అతని హృదయమున గాఢముగా నాటుకొనెను. మారుమాటాడక అతడు నిద్రించెను. మరునాటి ఉదయముననే లేచి అతడు మౌనముగా కాశీ ప్రయాణమైనాడు. కాశి యందు ఒక ప్రశాంత స్థలమున రామనామము జపించి - తర్వాత జగత్ప్రసిద్ధమైన "రామచరిత మానస్" అను రామాయణమును రచించెను.

అశాశ్వతమైన వస్తువులపై, మమకారముకన్న మోక్షప్రదాత శ్రీరామచంద్రుని ఎడఁప్రేమ మేలుగదా!

★ ★ ★ ★

## 19

## దైవస్తుతి

అంబా శాంభవి చంద్రమౌళి రబలాపర్ణా ఉమా పార్వతీ
కాళీ హైమవతీ శివా త్రిణయనీ కాత్యాయనీ భైరవీ,
సావిత్రీ నవయౌవనా శుభకరీ సామ్రాజ్యలక్ష్మీ ప్రదా
చిద్రూపీ పరదేవతా భగవతీ శ్రీరాజ రాజేశ్వరీ.

### కుమారా!

తనయుఁడు చెడుగై యుండిన
జనకుని తప్పన్నమాట సత్యమెరుగుఁ, గా
వున నీ జననీ జనకుల
కు నపఖ్యాతి యగురీతిఁ గొనకు కుమారా!

**భావము :** కుమారా! పుత్రుడు చెడ్డవాడయినచో తండ్రిదే తప్పు అని యందురు. కాబట్టి నీ తల్లి దండ్రులకు అపఖ్యాతి వచ్చునట్లుగా మెలగకుము.

★★★★

# మహిషాసురమర్దని

పూర్వము దేవాసురలకు శతవర్షములు ఘోరమగు పోరు జరిగెను. దేవతలకు ఇంద్రుడు, రాక్షసులకు మహిషాసురుడు నాయకత్వము వహించిరి. మహా పరాక్రమ సంపన్నులగు రాక్షసుల ముందు దేవసైన్యము పటాపంచలై పోయెను. దేవతలను జయించిన అనంతరము మహిషాసురుడు ఇంద్రపదవిని అధిష్ఠించెను. పరాభూతులైన దేవతలు త్రిమూర్తులకడ కరిగి తమకు సంభవించిన దుస్థితిని సవిస్తరముగా ఎరిగించిరి. దురాత్ముడగు మహిషాసురుని పాలనలో దేవతలెట్లు మర్త్యులవలె సంచరించవలసి వచ్చినదో తెలిపి శరణుకోరిరి. దేవతల దీనాలాపములు విని విష్ణుమూర్తి, శివుడు కోపఘూర్ణిత నేత్రులైరి. వారి ముఖములు భయంకరములయ్యెను. వారి వదనముల నుండియు, ఇంద్రాది దేవతల శరీరములనుండియు మహాతేజస్సు వెలువడెను.

ఇట్లు వెలువడిన తేజోరాశి అంతయు కలిసి ఒక స్త్రీ రూపమును ధరించెను. శివుని తేజస్సు ఆమె ముఖముగా రూపొందెను. విష్ణుమూర్తి తేజస్సు బాహువులుగను, బ్రహ్మతేజస్సు ఆమె పాదములుగనై శుభమూర్తియగు దేవిగా రూపొందెను. శివుడు ఆమెకు శూలము నిచ్చెను. విష్ణువు చక్రమును ప్రసాదించెను. ఇంద్రుడు వజ్రాయుధమును సమకూర్చెను. వరుణుడు పాశమునిచ్చెను. బ్రహ్మదేవుడు ఒక అక్షమాలను, కమండలువును ఇచ్చెను. హిమవంతుడు సింహమును వాహనముగా ఇచ్చెను. ఇట్లు సర్వదేవతలచే ఆయుధ భూషణాదులు సమర్పింపబడి ఆ దేవి మహాట్టహాసము చేసెను.

దేవతలు పరమానందముతో ఆ సింహవాహన అసురవధకై బయలుదేరగనే జయ జయ నాదములు చేసిరి. త్రిలోకములను గడగడలాడించిన అసుర సైన్యమునకు దేవికి యుద్ధము ఆరంభమయ్యెను. మహిషాసురుని పక్షమున అతని సేనానియగు చిక్షురుడును, చతురంగబల సమేతముగా సమర స్థలికి కదలివచ్చెను. ఉదగ్రుడు, మహాహనుడు, అసిలోముడు, భాష్కలుడు, బిడాలుడు మున్నగు సురారులు యుద్ధములో పోరాడారు. దేవిని చంపుటకై వారు ఆమెను ఖడ్గములతో కొట్టిరి. చండికాదేవి వారి శస్త్రాస్త్రములను అవలీలగా ఖండించి వేసెను. దేవి వాహనమైన సింహము జూలు విదల్చుచు దావాగ్నివలె అసుర సైన్యమును నాశన మొనర్చెను. దేవి త్రిశూలముతోను, గదతోను రాక్షసులను వధించెను. సమరాంగణమంతయు ఖండములైన మొండెములతో, ఛేదింపబడిన శిరస్సులతో,

తెగిపోయిన బాహువులతో భీభత్సముగా ఉండెను. మహిషుని సేనానియగు చిక్షురుడు అంబికపై ఆగ్రహముతో యుద్ధమునకు వచ్చెను. మేరు పర్వతము పై వర్షము కురిసినట్లు దేవి వానిపై బాణ వర్షము కురిపించి వాని సారథిని చంపి, చిక్షురుని శరీరమును బాణములతో గ్రుచ్చి వైచెను. సర్వ రాక్షస సైన్యము హతమయ్యెను.

అనంతరము మహిషాసురుడు తనగిట్టలతో భూతలమును దద్దరిల్లునట్లు చేసి, కొమ్ములతో పర్వతములను ఎగురవైచుచు, భయంకరమైన అంకెలు వేయుచు దేవిని ఎదుర్కొనెను. తన పైకి వచ్చిన మహిషుని దేవి తన పాశముతో బంధించెను. వాడు అంత తన మహిషరూపము వీడి సింహరూపము ధరించెను. అంబిక దాని శిరస్సును ఖండించి వైచెను. వెంటనే అతడు ఖడ్గహస్తుడైన మానవ రూపము ధరించెను. తత్ క్షణమే ఆ పురుషుని ఛేదించెను. అతడు వెంటనే పెద్ద ఏనుగు రూపమును ధరించెను. చండిక ఆ గజము యొక్క తొండమును ఖండించి వేసెను. ఆ మహాసురుడు తన మహిషరూపమును మరల దాల్చి ముల్లోకములను తల్లడిల్ల చేసెను. అప్పుడు జగన్మాతయగు చండిక క్రోధముతో "ఓరీ మూఢుడా! మరియొక క్షణములో నీకు అంతము తప్పదు." అని గర్జించుచు ఆ మహాసురునిపై విజృంభించి పాదముతో అతని కంఠమును త్రొక్కిపట్టి శూలముతో వానిని పొడిచెను. అతడు దేవి పాదము క్రింద చిక్కుకొని తన మహిష ముఖములో నుండి యథార్థ స్వరూపముతో సగము వెలువడెను. ఇట్లు సగము వెలువడి తన నిజ రూపముతో పోరాడుచున్న ఆ మహిషాసురుని శిరశ్ఛేద మొనర్చి కూల్చి వేసెను. దేవగణ మంతయు పరమ హర్షముతో దేవిని స్తుతించిరి.

సర్వదేవతా సమారాధితయగు దేవి అమంగళములను నశింపజేసి భక్తులకు మోక్షమును ప్రసాదించు జగన్మాత. ఆమె చరితము అద్భుతము.



20

## దైవస్తుతి

వాగర్థా వివ సంపృక్తౌ
వాగర్థ ప్రతిపత్తయే
జగతః పితరౌ వందే
పార్వతీ పరమేశ్వరౌ.

### కుమారా!

తమజాలమం గురువృద్ధుల
జననీ జనకులను సాధు జనుల నెవఁడు దా
ఘనుఁడయ్యుఁ బ్రోవఁడో యా
జనుఁడే జీవన్మృతుండు జగతిఁ గుమారా!

భావము : కుమారా! కుమారులను, గురువులను, పెద్దవారిని, తల్లిదండ్రులను సజ్జనులను తాను గొప్పవాడై యుండినను రక్షింపడో అట్టివానినే "జీవన్మృతుడు" అందురు - అనగా అట్టి మానవుడు బ్రతికియుండియు చచ్చిన వానితో సమానమని భావము.

★★★★

# సిరియాళుడు

కాంచీపురంలో చిరుతొండనంబి అనే వైశ్యకులశేఖరుడు ఉండేవాడు. చిరుతొండ నంబి అఖండ శివభక్తి తత్పరుడు. ఆయన భార్య తిరువెంగనాంచి. ఆ పుణ్య దంపతులు జంగమారాధనా తత్పరులు. వారి పుత్రుడు సిరియాళుడు.

చిరుతొండడు పూర్వజన్మవాసనా విశేషంచేత ఏకామ్రనాథుణ్ణి ఆరాధిస్తూ జంగమ ప్రమథులకు ధన మనోవంచనము లేకుండా అడిగిన పదార్థం లేదనక సదా అన్నదానం చేసేవాడు. ఒకనాడు పరమశివుడు పార్వతీదేవికి చిరుతొండని భక్తి ప్రభావం నిరూపింప దలచాడు. ఇంద్రుని రావించి కంచిలో వర్షం కురిపించమని ఆజ్ఞాపించాడు. అకస్మికంగా ఉరుములతో మెరుపులతో పాము వ్రేలాడగట్టినట్టుగా, ఆకాశంలో రంధ్రం పడినట్లుగా, కుంభవర్షం కురిసింది. చిఱుతొండనంబి వంట చెఱకు లభించక పోవడంవల్ల వాములులాగా ఉన్న వస్త్రాలనే తైలంలో ముంచి నిప్పు చేసి శివభక్తులకు వండి వడ్డించేవాడు. ఇరవై ఒక్క రోజుల పాటు వర్షం కురిసేటప్పటికి, ఆ జలోపద్రవానికి జంగమయోగి ప్రముఖులంతా కంచి పట్టణం వీడి ఎక్కడివాళ్ళు అక్కడ వెళ్లిపోయారు.

ఒకనాడు నిత్యాన్నదానశీలుడైన చిరుతొండనంబికి ఒక్క శివయోగి కూడా కనిపించలేదు. తిరిగి తిరిగి చివరకు కాంచీపురం ఊరిబయట ఉన్న పాడుబడిన గుడికి వెళ్ళాడు. గర్భమంటపంలో రుద్రాక్షమాలిక ధరించి, త్రిపుండ్రాలంకృతుడైన ఒక వృద్ధుడు. అతనికి సేవ చేస్తున్న ముసలి అవ్వ కనిపించారు. ఆ మాయ జోగి దంపతులకు ప్రణామం చేసి, తమ యింటికి వచ్చి శివార్చన నందుకొని చరితార్థుణ్ని చేయమని ప్రార్థించాడు చిఱుతొండడు.

ఆ పరమ వృద్ధుడు వాలిపోయిన కనుబొమ లెత్తి శివుని కారుణ్యామని ఆశీర్వదించి "నీ వంశమేది? నీ పేరేది? పెండ్లము నీ మాటలు వినునా? నీకు సంతానమున్నదా? అని ప్రశ్నించాడు." "ఏడురోజుల నుండి నిరాహార వ్రతం పూని ఉన్నాను. ఆ వ్రతానికి ఉద్యాపనము పశూపహారము. ఆ యాగపశువు నరుడు తప్ప మరొకడు పనికి రాడు. ఆ నరుడు కూడ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య సంతతులలో ఒకడై ఉండాలి. సుందరుడు, రోగ విహీనుడు, అయిన ఆ పిన్న వయసువాణ్ని తల్లిదండ్రులు వండి మాకు వడ్డించి, మాతోపాటు భోజనం చేయాలి." అని పలికాడు.

చిరుతొండడు తన భార్య శివభక్తి విశ్వాసములను, జంగమారాధన నిష్ఠను తన ఆజ్ఞను జవదాటని కుమారుని, మనసులో స్మరించి ఇంటికి వెళ్ళి విషయమంతా భార్యకు చెప్పాడు. ఆమె ముసి ముసి నవ్వులు నవ్వి "మన శరీరార్థ ప్రాణాలకు

కర్తలు శివయోగీశ్వరులే కదా! వారి సొమ్ములు వారికి సమర్పించటానికి ఆలోచన ఎందులకు?'' అని పలికింది. వెంటనే శివయోగిని తీసుకురావడానికి బయలుదేరాడు చిరుతొండడు.

అంతకు ముందే శివుడు మరొక వేషంలో గురువుగారి యింటిలో పాఠాలు చదువుకుంటున్న సిరియాళుని దగ్గరకు వెళ్ళాడు. సిరియాళుడు ఆయన వెళ్ళేసరికి ''నీలకంఠ స్తవము'' చదువుతూ మిగిలిన పిల్లలలో గ్రహాలలో చంద్రుడులాగా ప్రకాశిస్తున్నాడు. ఆ జటాధారిని చూడగానే సిరియాళుడు ఎదురుగా వెళ్ళి సాష్టాంగ నమస్కారం చేశాడు. భక్తి తాత్పర్యంతో నమస్కరిస్తూ నిల్చున్న సిరియాళునితో ''నాయనా! నీ తండ్రి చిఱుతొండనంబి నిన్ను చంపి ఒక నిర్భాగ్యుడైన శివయోగికి ఆహారంగా పెట్టబోతున్నాడు. కడుపున బుట్టిన కూరిమి కుమారుని, మెడకోసి చంపి జోగులకు పెట్టే క్రూరుడు ఈ లోకంలో ఎవడైనా ఉంటాడా? స్నేహ శీలిని కాబట్టి ఈ విషయం నీకు చెప్పడానికై వచ్చాను. బ్రతికి వుంటే బలుసాకు తినవచ్చు. నీ ప్రాణాలు కాపాడుకో'' అన్నాడు. కుమార సిరియాళుడు చెవులు మూసికొని ''మహానుభావా! నీవీ రకంగా మాట్లాడటం న్యాయమా! ఇతరుల కోసమై శరీరమును ధనమును వ్యయం చేయడం కంటె ఈ జన్మకు సార్థక్య మేమున్నది?'' అన్నాడు.

శివుడు ''ఓహో! వీడు చిఱుతొండని మించినవాడు'' అనుకుని వెడలి పోయెను.

చిఱుతొండడు వృద్ధ శివయోగిని వీపుమీద ఎక్కించుకొని గుడ్డి అవ్వ వెంటరాగా ఇంటికి తీసుకువెళ్లాడు. ఇంటికి తెచ్చి వారిని స్నానం చేయించి నూతన వస్త్రాలు సమర్పించాడు. ఇంతలో శివుని ఆజ్ఞచే పార్వతీదేవి పచ్చి బాలెంతరాలు వేషంతో తిరువెంగనాంచి దగ్గరకు వచ్చి ''అమ్మా! నిజమో అబద్ధమో నాకు తెలియదు కాని ప్రజలందరూ ఒకటే చెప్పుకొంటున్నారు. మీరు కుమారుని చంపి ఎవరో దుర్మార్గుడైన యోగికి ఓగిరంగా పెట్టబోతున్నారట. జోగులు కపటోపాయ శీలురు. కన్న కుమారుణ్ణి చంపటానికి మీకు బుద్ధి ఎలా వచ్చింది? ఆ తండ్రి మగవాడా? మ్రానా?'' అని హితవు చెప్పింది. ఆ బాలెంతరాలు మాటలు విని తిరువెంగనాంచి ''అమ్మా! శివుడు, శివయోగి – వీరిరువురికి మధ్య భేదమేమున్నది? శివుడే కర్త, శివుడే భోక్త. అర్థ ప్రాణములు శివాధీనములు – వీటికై చింతించడం ఎందులకు? పాపం చాలసేపయింది వచ్చి వెళ్లిరా'' అని పలికింది. తన పన్నాగము విఫలం కాగా పార్వతీ దేవి అంతర్ధానమై పోయింది.

చిఱుతొండనంబి పాఠశాలకు వెళ్లి కుమారుణ్ణి తీసుకు వచ్చాడు. సుగంధ ద్రవ్యములతో చక్కగా స్నానం చేయించాడు. సిగలో పూలుపెట్టారు. నుదుట భస్మ త్రిపుండ్రాంకము తీర్చిదిద్దారు. కుమారుణ్ణి తొడమీద కూర్చుండ బెట్టుకొని, "తండ్రీ! సిరాలా! మా వలన ప్రేమవాత్సల్యాలను మనసులో భావించకు. ఎల్లప్పుడూ పంచాక్షరీ మంత్రమే జపిస్తూ ఉండు. ఇందే పరబ్రహ్మార్థ సంసిద్ధి" అని పలికి కత్తితో అతని శిరమును ఖండించాడు. ఒక్క వ్రేటుతో క్రిందపడిపోయిన సిరియాళుని శిరస్సు "నమః శివాయ" అని మంత్రం పఠిస్తున్నది.

భోజనశాలలో వంట సిద్ధమైంది. అమృతాహారం ఆరగించవలసినదిగా నమస్కరించారు నంబి దంపతులు. "అయ్యో! నా వ్రతము భంగమైనది. నీ వారగింపకుండా భోజనం చేయడానికి నాకు చేయాడుతుందా? అంతేకాక మఱొక్క నియమం ఉన్నది. మగబిడ్డడు లేని నిర్భాగ్యుని ఇంటిలో భోజనం చేయకూడదు. నీ కుమారుని పిలువు." అన్నాడు. మాయా జంగముడు "స్వామీ! ముందే ఆ విషయం చెప్పి ఉంటే కుమారుని పిలిచేవాణ్ణి. ఇప్పుడు వాడెక్కడికి పోయినాడో ఆడుకోడానికి" అన్నాడు నంబి. వృద్ధ దంపతులు నంబి భార్యను, ఎలుగెత్తి కుమారుని పిలవమన్నారు. వెంటనే "రారా! నా కన్న తండ్రీ! సిరాలా! రారా! నా ప్రాణ ప్రదమా! రారా! రారా! కుమారా!" అని దిక్కులు ప్రతిధ్వనించేటట్లు పిలిచింది తల్లి. మరుక్షణమే ఆకులలో ఉన్న శాకపాకాలనుంచీ సిరియాల కుమారుడు వారి ముందు నిలిచాడు. పరమశివుడు భస్మదేహంతో నాగాలంకార భూషణుడై అర్ధ చంద్రాకృతితో సాక్షాత్కరించి, సశరీరములతో కైలాసానికి రమ్మని వారిని ఆహ్వానించాడు. అంత చిఱుతొండడు "స్వామీ!" నీ దయవల్ల వేయి గోత్రములకు చెందిన మా వైశ్యులందరు ఈ కంచి పట్టణంలో ఈశ్వరా రాధనం చేస్తూ ఉన్నారు. వారి నందరినీ వీడి నేనొక్కడినే రాలేను. ఇంతమందినీ కైలాసానికి రమ్మంటే వస్తాను" అన్నాడు. శంభుడు కరుణించి కంచిలో ఉన్న వైశ్యులందరూ కైలాసానికి వచ్చేటట్లు వరం ప్రసాదించాడు.

కన్న కుమారుని కూడ బలిచేయడానికి వెనుదీయకుండా తనతోపాటు స్వజనానికి కూడ మోక్షం ఇప్పించిన చిరుతొండ నంబి, పరోపకారార్థమై తన శరీరమే దానమొనర్చిన సిరియాళుడు, శైవభక్తులలో అగ్రగణ్యుడు.



## 21

### దైవస్తుతి

కమలాకుచ చూచుక కుంకుమతో
నియతారుణి తాతుల నీలతనో,
కమలాయత లోచన లోకపతే
విజయీభవ వేంకట శైలపతే!

### కుమారీ!

తన కెంత మేలు చేసిన
మనమున కింపైన పనులు మసలిన దాసి
వనితల కెన్నటి కైనను
జనవిచ్చి మెలంగరాదు జగతి కుమారీ !

భావము : తన కెంత మేలు చేసినప్పటికిని, మనస్సున కిష్టమైన పనులు చేసినప్పటికిని, దాసికి ఎప్పుడును చను వీయరాదు.

★★★★

# గార్గ్యుడు
## (బృహదారణ్యకోపనిషద్గాథ)

గార్గ్యుడు భరద్వాజమహర్షి శిష్యుడు. తీక్షణబుద్ధితో, బ్రహ్మచర్య దీక్షతో, ప్రగాఢ పరిశ్రమతో గార్గ్యుడు వేద శాస్త్రములయందు సంపూర్ణాధికారియైనాడు. గుర్వాశ్రమమునకు వచ్చిన విద్వాంసులతో శాస్త్ర చర్చచేయుట వారిని పరాజితుల చేయుట అతని వినోదము. సమావర్తన సంస్కారము చేసి భరద్వాజులు అతనిని స్వగృహమునకు వెళ్ళుటకు అనుమతించారు. వాత్సల్యంతో భరద్వాజులు- ''శిష్యా! ముందైన్నడూ పొరపాటున గూడ గర్వించి ఏ విద్వాంసుని అవమానించకుము. విద్వాంసుడు సాటి విద్వాంసుని అవమానించుట శాస్త్ర విరుద్ధము. అట్టివాని విద్య నిరర్థకము. అట్టి తరి బుద్ధి క్రూరమైనదై పోవును. వారి వలన సమాజమున కెన్నడూ హితము చేకూరదు.'' అని సందేశమిచ్చి పంపెను. గార్గ్యుని స్వాభిమానము దెబ్బతినెను.

ఆశ్రమమును వీడు దుఃఖములో స్వగృహము చేరు సంతసముతో గార్గ్యుడు పయనమై వెళ్ళాడు. మాతృప్రేమతో తన్ను చూచిన గురుపత్నిని, సోదరభావంతో కాలం గడిపిన విద్యార్థి బృందాన్ని తల్చుకుంటూ ఆశ్రమం వైపు తిరిగి తిరిగి చూస్తూ వదలలేక ఆశ్రమాన్ని వదలి వెళ్ళాడు గార్గ్యుడు. స్వగృహం చేరి దారిద్ర్యము వలన కుటుంబ జనులు పొందుతూన్న దైన్యం అతనిని కలచివేసింది. రెండు మూడు దినములు ఎట్లో గడిపి ధనార్థియై, తండ్రియాజ్ఞ తీసుకుని బయల్దేరాడు గార్గ్యుడు. కాశీ రాజైన అజాత శత్రువు విద్యా దాన శక్తుల కారణంగా విశ్వ విఖ్యాతుడైనాడు. అతని వద్దకు ధనార్థులేగాక విద్యా సముపార్జనకై రాకుమారులు, ముని కుమారులు వచ్చేవారు. అంతేగాదు అనేక మంది మహా పండితులు కూడ తమ సందేహములను నివృత్తి చేసుకోవడానికి అజాత శత్రువును చేరేవారు. బ్రహ్మజ్ఞానియైన ఆ రాజు వారి సందేహాలను చక్కగా నివృత్తిచేసి భూరిదక్షిణలతో సత్కరించేవాడు. గార్గ్యుడు అజాత శత్రువుని గురించి విన్నాడు. అందుచేత కాశీ నగరమునకు ప్రయాణమైనాడు. దారిలో అతడు ఉపమన్యుని ఆశ్రమాన్ని దర్శించాడు. తేజోమూర్తియైన ఉపమన్యుడు గార్గ్యుని వినయశీలానికి సంతసించి కాశీ నరేంద్రుని దర్శనం చేయిస్తానన్నాడు. గార్గ్యుడు చాల ఆనందించాడు.

పండిత సభ యందువున్న అజాతశత్రువు, ఆచార్య ఉపమన్యువు శిష్యత్రయంతో వస్తున్నాడన్న వార్తవిని ఎదురేగి పూజించి మణిమయ సింహాసనంపై ఆసీనుని చేశాడు. ఉపమన్యువు నరేంద్రునికి గార్గ్యుని పరిచయం చేసి స్వప్రయోజన సిద్ధికి రాజదర్శనం చేస్తున్నట్లుగా చెప్పాడు. గార్గ్యుని అహం ఆ మాటలకు దెబ్బతిన్నది. అతనిలోని పాండిత్యాహంకారసర్పం పడగవిప్పి బుసలు కొట్టింది. ఉచితా నుచితాలు మరచి గార్గ్యుడు- "భూపాలా! మీరు అనేక విద్యార్థులను చదివించుదురని విన్నాను. ఇట్టి బ్రాహ్మణ ప్రవృత్తికి మీరు సంపూర్ణాధికారులవునో కాదో తెలుసుకొనుటకు మీతో శాస్త్ర చర్చను కోరుతున్నాను" అన్నాడు. ఈ మాటలు సభికులందరిని వ్యధ పెట్టినాయి. అజాత శత్రువు వినయంగా" ఆర్యా! తమవంటి పండిత ప్రకాండులతో శాస్త్రచర్చ చేయుసాహసం నేనెన్నడు కోరలేదు. మీరు అభిలషించినచో రేపటి సాయంత్రము మీ సేవకు సంసిద్ధుడను. మీరు అలసినట్లున్నారు విశ్రాంతి తీసుకొనండి" అని చెప్పాడు. ఆ రాజు మాటలలో గార్గ్యునికి వ్యంగ్య భావం గోచరించింది. ఆచార్యుని ఆజ్ఞవలన అణగియున్న అతని అభిమాన ప్రవృత్తి నగ్న రూపంలో పునః ప్రత్యక్షమైంది. క్రోధారుణ నేత్రాలతో "రాజా! నీ సేవలు నాకు అవసరంలేదు. బ్రహ్మ జ్ఞాన విషయములో మీ శక్తి ఎంతటిదో పరీక్షింప గోరుచున్నాను." గార్గ్యుని పాండిత్యమదము సభవారికి గోచరమయ్యెను. రాజు సభ చాలించెను.

మరునాడు సాయంత్రము అతిథిశాలలో అజాత శత్రువు గార్గ్యుని దర్శించెను. గార్గ్యుని కోరిక మేరకు శాస్త్ర చర్చ ప్రారంభ మాయెను. గార్గ్యుని ప్రథమ ప్రశ్నలోనే అతని జ్ఞానపరిమితి అజాతశత్రువుకు గోచరమైంది. గార్గ్యుడు పరాజితుడై తన అజ్ఞానమునకు చింతించి అహంకారము చంపుకుని జ్ఞానానికై అజాత శత్రువునే ఆశ్రయించాడు.

విద్వాంసులను అవమానించుట నీచ సర్పము కన్న దుఃఖదాయకమైనది. అట్టి వాని విద్య నిరర్థకము, బుద్ధి క్రూరపూర్ణమైనదై పోవును. అందువలన సజ్జనులకు, పండితులకు అది తగదు.

★ ★ ★ ★

22

## దైవ స్తుతి

పద్మాసన స్థితే దేవి
పరబ్రహ్మ స్వరూపిణి
పరమేశ్వరి జగన్మాతః
మహాలక్ష్మి నమోఽస్తుతే.

### భాస్కరా!

తాలిమి తోడుతం దగవు తప్పక నేర్పరి యొప్పు దప్పులం
బాలనసేయుఁగా, కట నుపాయ విహీనుడు సేయ నేర్చునే
పాలును నీరు వేఱు పరుపంగ మరాళ మెఱుంగు గాక మా
ర్జాల మెఱుంగునే తదురు చారు రసజ్ఞతఁ బూన భాస్కరా !11

భావము : భాస్కరా! నేర్పరి యగువాడు సహనముతో న్యాయమార్గమున మంచి చెడులను విమర్శించి నిర్ణయించును. కాని ఉపాయ హీనుడట్లు చేయనేరడు. హంస పాలను, నీటిని వేరు చేయగలుగును. గాని మార్జాలమున కట్టి వివేకము లేదు.

★★★★

# భృగుమహర్షి

ఒకనాడు సరస్వతీ నదీ తీరంలో మహా తపోసంపన్నులగు కశ్యప, వశిష్ఠ, వామదేవాది మునులు సమావేశమైనారు. వారందరు విశ్వకల్యాణార్థమై ఒక మహాయాగమును చేయ నిశ్చయించారు. ఆ సమయానికి నారద మహర్షి కూడ అచటకు విచ్చేశాడు. మహర్షి మండలి నారదునకు అభివాదములు చెప్పి సుఖాసీనుని చేశారు. నారదుడు ఆ యాగ లక్ష్యమునకు సంతోషించాడు. యజ్ఞభోక్త, ఫలప్రదాత, సర్వసాక్షి, ప్రభువు అగు దేవుని, యజ్ఞముతో సంప్రీతునిగా జేయ నిర్ణయించారు. అయితే, త్రిమూర్తులలో అట్టి వాడెవరు అన్నది వారి సమస్య. ఈ సమస్యను పరిష్కరించి అట్టి పరమ పురుషుని నిర్ణయించే భారం తపో వృద్ధుడు, మహాత్మ పూర్ణుడు అయిన భృగుమహర్షిపై ఉంచారు. 'సరే' యని ఆ మహర్షి అంగీకరించి బయల్దేరాడు.

తపో గరిమకు నిదర్శనమా అన్నట్లు భృగుమహర్షి అరికాలునందు ఒక నేత్రం ఉన్నది. అగ్ని సమ తేజోవంతుడైన భృగువు సరాసరి సత్యలోకానికి వెళ్ళాడు. బ్రహ్మదేవుని పరీక్షించడానికి, ఆ సమయాన బ్రహ్మ సరస్వతి దేవితో వినోద కాలక్షేపం చేస్తున్నాడు. ఆ స్వర రూపిణి తన వీణానాదంతో లోకాన్ని ఆనంద పరవశం చేస్తోంది. అందరూ ఆనందంతో మైమరచి ఉన్నారు. భృగుమహర్షి రాకను బ్రహ్మ గమనింపలేదు. గౌరవాభివాదము లేదు. అతిథి సత్కారం అసలే లేదు. బ్రహ్మదేవుని తిరస్కార భావమునకు కోపించి భృగువు ''నీవు అపూజ్యాడువు కమ్ము'' అని బ్రహ్మను శపించి వెళ్ళిపోయాడు.

సరాసరి భృగువు కైలాసం చేరాడు. అక్కడ పార్వతీ పరమేశ్వరులు ఆనందంతో తాండవం చేస్తున్నారు. డమరుక శబ్దాలలో, తాండవ నృత్య సంరంభంలో భృగువు రాకను గమనించినవారే లేరు. ఆదరంలో ఆహ్వానించిన వారసలే లేరు. భృగువు కోపంతో రెచ్చిపోయాడు. ''శివ రూపానికి కాక శివలింగానికే పూజ్యత గల్గుగాక'' అని శపించి విసవిస వెళ్ళిపోయాడు.

భృగువు విష్ణులోకానికి వెళ్ళాడు. ఏకాంతంలో మహావిష్ణువు శేషశయ్యపై లక్ష్మీదేవితో సరస సల్లాపాలతో మునిగి ఉన్నాడు. వారు భృగుమహర్షిని చూడలేదు. వేచియున్న మునిని పలుకరింప లేదు. భృగుముని అవమానభారంతో క్రుద్ధుడైనాడు. అతడు సురసురలాడుతూ విష్ణుమూర్తిని సమీపించి ఆయన వక్షస్థలమును తన్నెను. సంభ్రమముతో గోవిందుడు లేచి మునిని గౌరవించి సుఖాసీనుని గావించెను. ''మహర్షీ! స్త్రీ లోలుడనై మీరాక లెరుగజాలక మీయెడ అపరాధము నొనర్చితిని. తాడనమున మీ పాదము నొచ్చెను కదా'' అని కమలాక్షుడు ముని పాదములొత్తు నెపమున భృగుపాదస్థమగు నయనమును చిదిపెను. తోడనే మునికి తన అకృత్యము తెలిసివచ్చి విష్ణుపాదములపై బడెను. అతని అహంకారము, గర్వము నశించెను.

ఎంతటి తపోధనుడైనా అహంకార, గర్వములు కలిగియున్నచో ఎట్టి అకృత్యమొనర్చుట కైనను వెనుదీయడు కదా!

★★★★

**త్యజేదేకం కులస్యార్థే గ్రామస్యార్థే కులం త్యజేత్**
**గ్రామం జనపదస్యార్థే, ఆత్మార్థే పృథివీం త్యజేత్.**

★ ★ ★ ★

## 23

## దైవస్తుతి

వసుదేవ సుతం దేవం
కంస చాణూర మర్దనమ్
దేవకీ పరమానందం
కృష్ణం వందే జగద్గురుమ్.

## కుమారీ!

పర పురుషు లన్నదమ్ములు,
వరుఁడే దైవంబు, తోడి పడుచుల్ వదినల్
మరదండ్రు నత్తమామలు
ధరఁ దల్లియుఁ దండ్రియువియుఁ దలఁడు కుమారీ!

భావము : కుమారీ! పర పురుషులను అన్నదమ్ములగను, నీ భర్తను దేవుడుగను, వదినెలను మరదండ్రను అక్క చెల్లెండ్రగను, అత్త మామలను తల్లి దండ్రులుగను భావింప వలయును.

★★★★

# సైరంధ్రి

అరణ్యవాసం పూర్తి అయిపోయింది. ధర్మరాజు కంకుభట్టుగా, భీమసేనుడు వలలుడుగా, అర్జునుడు బృహన్నలగా, నకులుడు గ్రంథికుడుగా, సహదేవుడు తంత్రీపాలుడుగా, ద్రౌపది సైరంధ్రిగా పేరులు మార్చుకొని విరాటురాజు కొల్వులో ప్రవేశించారు.

విరాటరాజు బావమరది పేరు కీచకుడు. కీచకుడు మహా బలిష్ఠుడు. దుర్విదగ్ధుడు, రూపాభిమాని. తన బాహు పరాక్రమంతో పెక్కుమంది రాజులను జయించి బావగారికి ఇష్టుడై సేనాపతియై తన అధిపత్యం వెలగ బెడుతున్నాడు. అతడు ఆడింది ఆటగా పాడింది పాటగా సాగిపోతున్నది. ఒకనాడు రాజపత్నీ సుధేష్ణ అంతఃపురంలో ఉన్న సైరంధ్రిని చూచాడు కీచకుడు. అతని హృదయం మన్మథభావ వివశమైపోయింది. ఆమెను సమీపించి ''జగదేక సుకుమారీ ! నీ కేల ఈ వెట్టిచాకిరి. నీ ముఖచంద్రుడు నా హృదయాన్ని కలచివేస్తున్నాడు. బంగారు కలశములవలె ప్రకాశించే నీ వక్షోజాలు నన్ను తపింపచేస్తున్నాయి. మదనుడు నన్ను దహించివేస్తున్నాడు. నువ్వు నా భవనానికి వచ్చి సర్వ భోగభాగ్యాలు అనుభవించు' అని దీనంగా ప్రేమసల్లాపం ప్రారంభించాడు.

సైరంధ్రి వేషంలో ఉన్న పరమ పతివ్రతయైన ద్రౌపది అతనికి అనేక విధాల హితవు చెప్పింది. పర భార్యాసక్తుడైనవానికి ఇహపర లోకాలు లభించవని ధర్మం బోధించింది. కీచకుడికి ఆమె మాటలు చెవి కెక్కలేదు. అతనిలో మోహం పెచ్చు పెరిగింది. ''పరసతీ సంగమ పాపం ఓర్చవచ్చునుగాని, ఈ మన్మధ తాపాన్ని మాత్రం నేను భరించలేను'' అన్నాడు కీచకుడు.

ఇక మెత్తబడితే ఈ నీచుడు జంకడని తలచి ద్రౌపది ''బాహుబల పరాక్రమ సంపన్నులైనవారు భర్తలు నాకు ఐదుగురున్నారు. శత్రు నిర్మూలన విద్యలో వారు ఆరితేరినవారు. దేవతాంశ సంభూతులు. నీ మాన ప్రాణములు వారి చేతిలో హరింపబడుట తథ్యం . కీచకా!'' అని హెచ్చరించింది. మధాంధుడైన కీచకుడు ''నా బాహుబలాన్ని చెనకడానికి నీ పతులకే కాదు– ఈ మూడు లోకాలలో ఎవరికీ సాధ్యం కాదు'' అన్నాడు. ద్రౌపది వాడి మాటలు విని ''వివేక హీనుడా! అందని మ్రానిపండ్లు కోయటానికి ఎందుకు ప్రయత్నం చేస్తావు? రావణాసురుడు మొదలైనవారికి ఏ గతి పట్టిందో నీకూ ఆ గతి తప్పదు'' అని పలికింది. చిన్నబోయిన మొహంతో అక్కగారైన సుధేష్ణ, పతివ్రతలను వాంఛించే వాడివల్ల మొత్తం వంశానికి కీడుమూడుతుందని, కామాంధుడికి యమసదనమే సన్నిహితమైనట్లని చెప్పింది.

అక్కగారి హితబోధ అతడు పెడచెవిని బెట్టాడు. అతనిని పంపి, ఆ రాత్రి మద్యం తేవడానికై సుధేష్ణ సైరంధ్రిని కీచకుని భవనానికి పంపింది. కీచకుడు ఇదే సమయమని లేడిపిల్లమీద పడిన సింహంలా ద్రౌపదిని పట్టుకోబోయాడు. "ఓరీ! దుష్టుడా! నీచబుద్ధి కలిగిన నీకు దుర్గతి తప్పదు." అని అంటూ సైరంధ్రి రాజభవనానికి పరువెత్తుకుంటూ వచ్చింది. సైరంధ్రి వెంటబట్టాడు కీచకుడు. ఆమె రెండు చేతులతో వెనకకు నెట్టింది. మూలం తెగిన వృక్షంలా నేలకూలాడు కీచకుడు. సభాసదులందరు వాడి దుశ్చేష్టకు ముక్కుమీద వేలు వేసుకున్నారు.

భీమసేనుడికి ఈ విషయం తెలిసింది. తోకత్రొక్కిన భుజంగంలాగా మండిపడ్డాడు. అతడు ద్రౌపదితో ప్రేమను అభినయించి కీచకుని రాత్రికి నర్తనశాలకు రప్పించమని చెప్పాడు.

రాత్రి అంతా కీచకుడికి నిద్ర పట్టలేదు. అతనికి కన్ను తెరిచినా, కన్ను మూసినా ద్రౌపది రూపమే సాక్షాత్కరిస్తున్నది. తెల్లవారింది. ఉదయమే అక్కగారి అంతఃపురానికి వచ్చిన కీచకునితో ద్రౌపది రాత్రివేళకు తప్పకుండా నర్తనశాలకడకు రమ్మని చెప్పింది చిరునవ్వుతో. కీచకుడి సంతోషానికి అంతులేదు. చీకటిపడుతున్న సమయంలోనే సర్వాలంకారభూషితుడై కీచకుడు నర్తనశాలకు చేరుకున్నాడు. హంసతూలికాతల్పం సిద్ధం చేయించాడు. పుష్పాలంకారాలతో సుగంధ ద్రవ్యాలతో శయ్యాగారం అలంకరింపబడింది. జనసంచారమూ మాటుమణిగింది. అంతఃపురం నుంచి ద్రౌపదీ, పాకశాల నుండి భీమసేనుడు నర్తనశాలకు చేరుకున్నారు. ఆకు కదిలితేచాలు. సైరంధ్రి వస్తున్నదని తలచుకుంటూ కీచకుడు మోహవివశుడై పోతున్నాడు. ఆ గాఢాంధకారంలో నర్తనశాలలో ప్రవేశించాడు భీమసేనుడు. సైరంధ్రియే మందిరానికి వచ్చిందని కీచకుడు "రా! ప్రేయసీ! భయపడతావేం? నేనే! ప్రణయ సామ్రాజ్య సార్వభౌముణ్ణి" అనుకుంటూ ఎదురుగా వెళ్ళాడు. భీమసేనుడు "రా! రా! నీచుడా! నేటి రాత్రితో నీ జీవితం పరిసమాప్త మైనట్లే" అని వికటాట్టహాసం చేస్తూ మదించిన ఏనుగు మీద పడిన మృగేంద్రంలాగా వాడిమీద విరుచుకుబడి శరీరాన్ని ముష్టిఘాతాలతో చూర్ణం చేశాడు. బాహా మధ్యంలో బంధించి అంగసంధులు విడగొట్టి అతని శరీరాన్ని ముద్ద చేశాడు భీమసేనుడు.

పరస్త్రీలను బలాత్కరించటానికి సాహసంచేసే కాముకులకు కీచక వధ మంచి గుణపాఠం నేర్పుతుంది.



24

## దేవస్తుతి

సప్తాశ్వ రథమారూఢం ప్రచండం కశ్యపాత్మజమ్,
శ్వేతపద్మ ధరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్

## కుమారీ!

తిట్టినఁ దిట్టక, కొట్టినఁ
గొట్టక, కోపించెనేనిఁ గోపింపక నీ
పుట్టిన యింటికిఁ, బాదము
పెట్టిన యింటికి వన్నెపెట్టు కుమారీ!

**భావము :** నీవు బలవంతురాలవు, మాటకారివైనను నీ భర్త తిట్టినచో మరల తిట్టకుండ, కొట్టినచో తిరిగి కొట్టకుండ కన్నయింటి వారికిని అత్తవారికిని మంచిపేరు గడింపుము.

★★★★

# ఊరు భంగము

మైత్రేయ మహర్షి మహాతపస్సంపన్నుడు, సకల ధర్మ విశారదుడు. ఒకనాడు మైత్రేయ మహాముని న్యాయవిదుడైన ధర్మజుని కామ్యవనమునందు సందర్శించి ధృతరాష్ట్రుని కొలువునకు వచ్చెను. వచ్చిన మునీంద్రునకు అంబికేయుడు సభక్తికముగా సపర్యలు చేసెను. తన చేత పూజితుడై సుఖవిశ్రాంతుడైన మునివరునకు ముకుళిత హస్తుడై ధృతరాష్ట్రుడు ''భట్టారకా! మీ రెందుండి వచ్చితిరి?'' అని అడిగెను. మైత్రేయుడు ''మహారాజా! జటాజినములు ధరించి, వల్కములను గట్టి ఫలములు కాయలే ఆహారముగా కామ్యవనములోనున్న పాండవేయుల దగ్గరనుండి వచ్చితిని. నిన్ను నీ కుమారులను చూచిపోవుటకై ఇచ్చటకు ఏగుతెంచితిని.'' అని పలికెను.

ముని పలుకులు విని ''ఆర్యా! సత్యభాషణులైన పాండవులు కుశలముగా నున్నారా? మమ్ములను ఎప్పుడైన తలంచుచున్నారా? అమిత భుజశక్తి సంపన్నులైన పాండుసుతులు సౌభ్రాతృ స్నేహమును విచ్ఛేదమొనర్చి సమయాతిక్రమము చేయుటకు యత్నించుట లేదు గదా!'' అని ప్రశ్నించినాడు. మైత్రేయ మునీంద్రుడు ''రాజా! ధర్మయుతు లగుట వలనను, మునివరుల అనురాగము వలనను, పాండవులందరు కుశలము. పాండవులే నియమమును తప్పినచో సూర్యచంద్రాదులే గతులు తప్పుట తథ్యము. అకారణముగా నీ కుమారుడే వారికి కీడు ఒనర్చినాడు'' అని పలికి, దుర్యోధనుని వైపు తిరిగి ఇట్లనెను.

''నాయనా! పాండవులతో నీకు విరోధమేల? బుద్ధిమంతుడవై వారితో కలిసియున్న, కురువంశమునకు మేలు. పాండుకుమారులు మహాపరాక్రమోపేతులు, బలోదగ్రులు, రణరంగభీమలు. అందులోను భీమసేనుడు బక హిడింబాసురులను మట్టుబెట్టినవాడు. జరాసంధుని కూల్చినవాడు, కిమ్మీరుని బలమును వమ్ము చేసిన వాడు. అట్టి వాయు తనయుని సమరభూమిలో ఎదుర్కొన గలవా రెవరున్నారు? వారికి శ్రీ కృష్ణ ధృష్టద్యుమ్నులు బంధువులు. మానవు లెవ్వరికిని వారిని చంపుట సాధ్యముగాదు. నీవు వారితో మైత్రిని వహించుము. ఇదియే కర్తవ్యము.''

మైత్రేయుని పలుకులు ఆదరింపక, దుర్యోధనుడు కాలి బొటన వ్రేలును నేలపై వ్రాయుచు, బాహువులు ఎత్తి, తొడలు చరచి నవ్వసాగెను. దుర్యోధనుని గాంచి మైత్రేయ మహర్షి కుపితుడై ''ఈ అపరాధమునకు ప్రతిఫలముగా మహా యుద్ధమందు భీముని గదా ఘాతముచే నీ తొడలు భగ్నమగును గాక'' అని శపించెను.

మహర్షి శాపమునకు భయపడిపోయి ధృతరాష్ట్రుడు ''మహానుభావా! అట్లు కాకుండా వరము ప్రసాదింపు''మని ప్రార్థించెను. ''నీ కుమారుడు బుద్ధి కలిగి నీతి వంతుడై ప్రవర్తిల్లినచో అట్లు కాదు. కాక బుద్ధిహీనుడై గర్వితుడై వ్యవహరించుచో శాపాగ్ని ఫలమును అనుభవింపక తప్పదు.'' అని పలికి వెడలి పోయెను.

నీతి దూరుడై దుర్యోధనుడు పాండవుల రాజ్యభాగ మీయక, వారి వినాశమునే ఎల్లపుడు ఆకాంక్షించెను. ముని శాపప్రభావము వలన, మహాభారత రణాంతమున శ్రీకృష్ణుని ఆజ్ఞావశవర్తియై భీమసేనుడు తన గదా ప్రహారములచే దుర్యోధనుని ఊరు భంగము కావించెను.

ధర్మవర్తనులకు శుభములును, అధర్మశీలురకు అశుభములును కలుగుననుటకు పాండవ కౌరవ చరిత్రములు చక్కని ఉదాహరణములు.

★★★★

**ఛిన్నోపి రోహతి తరుః క్షీణోఽ ప్యుపచీయతే చంద్రః**
**ఇతి విమృశన్తః సన్తః సంతప్యన్తే నతే విపదా.**

★★★★

25

## దైవస్తుతి

చతుర్భుజే! చంద్రకళా వతంసే
కుచోన్నతే! కుంకుమరాగ శోణే!
పుండ్రేక్షు పాశాంకుశ పుష్పబాణ
హస్తే! నమస్తే! జగదేక మాతః.

## కుమారీ!

నవ్వంగ రాదు పలుమరు,
నవ్వినఁ జిఱునవ్వుగాని, నగరాదెపుడున్
గవ్వలవలె దంతంబులు
జవ్వన కానంగఁ బడెడిజాడ కుమారీ!

భావము : కుమారీ! నవ్వు నాలుగు విధముల చేటను విషయమును తెలిసికొని పలుమారులు నవ్వరాదు. ఒకవేళ నవ్వినను చిరునవ్వు నవ్వవలెను గాని పళ్ళన్నియు బయటికి కనిపించునట్లు ఇకిలించ రాదు.

★★★★

# పోతన

సహజ కవి అయిన బమ్మెర పోతన - కేసన మంత్రి లక్కమాంబల కుమారుడు. బమ్మెర వారి ఇల్లు శివభక్తికి నిలయము. వారి లోగిలి శివాలయమే. చిదానంద యోగీంద్రుని కృపా విశేషంచేత తారకమంత్రము పొందిన పోతనకు ''సహజ పాండిత్య'' ముదయించెను. అతని పాండిత్యమన్న జ్ఞానమే. రామభద్రుడు పోతనకు స్వప్నమున దర్శనమిచ్చి ''భాగవతము మన్నామాంకితముగ బలుకుము. భవబంధములు తెగు''నని ఆనతిచ్చెను. ఆ ఆజ్ఞ మేరకు పోతన మహాకవి సంస్కృత భాగవతమును ఆంధ్రీకరించెను.

పోతన రచించిన భాగవతము జగత్ప్రసిద్ధమైనది. కవులు తాము రచించిన గ్రంథములను రాజులకు అంకితమిచ్చి, ధన కనక వస్తు వాహనములు పొందుట పరిపాటి. పోతనకు కవి సార్వభౌముడయిన శ్రీనాథుడు బావగారు. శ్రీనాథుడు రాజాస్థానములలో ప్రవేశించి, తన ప్రజ్ఞను ప్రదర్శించి గ్రంథములను కృతి యొసగి సుఖించెడివాడు. శ్రీనాథుడు తన బావ అనుభవిస్తున్న దారిద్ర్యమును చూచి మిక్కిలి చింతించి కర్ణాటపతికి భాగవతము అంకితము చేయింపవలెనను ఊహతో అతడు పోతన వద్దకు పరివారంతో వచ్చాడు. కాని పోతన పేదరికమునకు క్రుంగువాడు కాదు. అతనికి నిధి కంటె రాముని సన్నిధియే చాల సుఖము. పాపము శ్రీనాథుడు పరిపరి విధాల పోతనకు నచ్చచెప్ప చూచాడు. కాని పోతనను నరస్తుతికి సుముఖునిగా చేయలేకపోయినాడు. అక్కసుతో శ్రీనాథుడు భాగవతమందు తప్పులు పట్టుకొని వెక్కిరించ దలచాడు. గజేంద్ర మోక్షమున గల ''సిరికిం జెప్పడు శంఖచక్ర యుగముం జేదోయి.........'' అను పద్యము చదివి - ''బావా! ఏమయ్యా నీ రచన! గజరాజును రక్షించుటకు పోవుచున్న శ్రీహరి ఏ సాధనములు తీసుకొనక వెళ్ళెనని వ్రాసితివే? అచట ఏమి చేయుటకు వెళ్ళాడు నీ శ్రీహరి? శంఖ చక్రములు లేకుండా చేతు లూపుకొనుచు చోద్యము చూచుటకై వెళ్ళాడా? అని ఆక్షేపించాడు. పోతన మారు మాటాడక ఊరకున్నాడు. మరునాడు శ్రీనాథుడు ఇతర పండితులతో ముచ్చటిస్తూ సావిడిలో కూర్చుని యుండగా, పోతన అతని కుమారుని ఒక చోట

దాచి పెరటిలోని నూతి యందు ఒక పెద్ద బండను వేసి "బావా! నీ కుమారుడు నూతిలో బడినాడు. అయ్యో!" అని అరచెను. శ్రీనాథుడు దభాలున పరుగెత్తివచ్చి విహ్వలుడై ఏమి చేయుటకు పేయాడక బావిచుట్టూ తిరుగుతూ అయ్యో! నాయనా ఎక్కడరా అని దుఃఖించసాగాడు. అంత పోతన "బావా! నిప్పైన ఏది? తాళ్ళేవీ?" అని ఎత్తి పొడిచాడు. శ్రీనాథుడు నిశ్చేష్టితుడైనాడు. గదిలో దాచిన కుమారుని చూపి "నీ వెట్లు పరువెత్తి వచ్చావో అట్లే జగత్తుకు తండ్రియైన పరమేశ్వరుడు కూడ భక్తుల మొర విని తటాలున వచ్చెనని గ్రహించితివా" అని అడిగెను. ఆ విధముగా పోతన భక్తి మహిమను, భక్తుల ఎడ పరమేశ్వరుని ప్రేమను నిరూపించాడు.

* * * *

**విద్వత్త్వం చ నృపత్వం చ నైవ తుల్యే కదాచన,**
**స్వదేశే పూజ్యతే రాజా, విద్వాన్ సర్వత్ర పూజ్యతే.**

* * * *

26

## దైవస్తుతి

ఓం నమః ప్రణవారాయ
శుదం జ్ఞానైక మూర్తయే
నిర్మలాయ ప్రశాంతాయ
దక్షిణామూర్తయే నమః

## కుమారీ!

జపములు గంగాయాత్రలు
తపములు నోములును దాన ధర్మంబులు పు-
ణ్య పురాణాల్ పతిభక్తికి
నుప మింపను సాటిరాక యుండుఁ, గుమారీ!

**భావము** : జప తపములు, దాన ధర్మములు మున్నగునవి పతిభక్తితో సమానములు కానేరవు. పతిభక్తియే వానికంటె శ్రేష్ఠమైనదని భావము.

★★★★

# కౌశికుడు

పూర్వం ఒక గ్రామంలో "కౌశికుడు" అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. కౌశికుడు ధర్మ తపశ్శీలుడు. నిరంతర అధ్యయన తత్పరుడు. ఒకనాడు అతడు గ్రామ సమీపంలో ఉన్న ఒక వృక్షమూలమునందు ఆసీనుడై వేదములను గుణించు కొంటున్నాడు. ఇంతలో చెట్టుకొమ్మమీద ఉన్న 'కొక్కెర' అతని మీద రెట్ట వేసింది. ఆ విప్రుడు మిక్కిలి కోపంతో కొమ్మ మీదికి చూశాడు. అతని క్రోధాగ్నిలో కొక్కెర భస్మమై పోయింది. "అయ్యో! నేనెంత దయాహీనుణ్ణి! నిష్కారణంగా ఈ కొక్కెర ప్రాణాలు తీసిన నా కింక శాంతి ఎక్కడిది?" అని బహువిధముల చింతిస్తూ మధ్యాహ్నం కావటంవల్ల గ్రామానికి భిక్షకు బయలుదేరాడు.

ఒక పుణ్య గృహము వాకిట్లో నిలిచి కౌశికుడు "భిక్షాం దేహి" అన్నాడు. ఆ గేస్తురాలు అతి సంభ్రమంతో భిక్ష పెట్టడానికై పాత్రలు శోధిస్తున్నది. ఇంతలో ఆమె భర్త ఆకలితో తూలిపోతూ ఇంటికి వచ్చాడు. ఆ పతివ్రత వెంటనే భక్తితో ప్రియమారగా అయనకు భోజనము పెట్టి, భోజనానంతరం చక్కని శయ్యను ఏర్పాటు చేసింది. భర్త పాదములు ఒత్తుతూ ఉండగా, బ్రాహ్మణుడు భిక్ష అడిగిన విషయం గుర్తుకు వచ్చి, వెంటనే భిక్ష గైకొని వెళ్ళింది. ఆమెను చూచి రోషలోచనుడై" ఓసీ! దుర్మతీ! అడిగినప్పుడు భిక్ష పెట్టక ఉపేక్షించి నన్ను అవమానం చేశావు. నీ కేల ఈ కండకావరము?" అన్నాడు.

ఆ మానినీ తిలకము వినయంగా "స్వామీ! వినుడు. నా భర్త క్షుధార్తుడై ఇంటికి రాగా ఆ మహాత్మునికి సపర్యచేస్తూ మీ మాటనే మరచాను, క్షమింపుడు" అని ప్రార్థించింది. అతడు మరింత క్రోధుడై "ఏమీ! నీ భర్త మా కంటెను గొప్పవాడా? లోకవంద్యులైన భూసురేంద్రులనే అవమానించిన దుష్టురాలవు నీవు. అవమానితులైన భూసురుల క్రోధాగ్నిలో త్రిభువనాలు సైతం నాశనం కావలసిందే! నీకు తెలియదు కాబోలు!" అని తీక్షణంగా పలికాడు.

కౌశికుని వాక్యములు విని ''మహానుభావా! బ్రహ్మావిదులైన బ్రాహ్మణ శ్రేష్ఠుల మహిమ ఎరుగ కేమి? అగ్రహానుగ్రహ సమర్థులైన పెక్కుమంది బ్రాహ్మణుల చరితలను వినుచునే ఉన్నారము కదా! కాని నాకు పతియే పరమ దైవము. త్రికరణశుద్ధిగా అయనకు హితము నాచరించుటయే నా వ్రతము. నీవు ముక్కోపివని ఎరుగుదును. కోపంతో ఒక కొక్కెర ప్రాణములను కోల్పోయినది గదా! నా పాతివ్రత్య మహిమచే ఈ విషయమును గ్రహించితిని. అయిన, క్రోధ మోహములే మానవులకు ఘోర శత్రువులు. ఎవడు ఇంద్రియములను జయించి సత్యవాక్పాలకుడై గురు జనమునకు హితమును కూర్చునో కామము వాని దరిజేరదు. షట్కర్మ లాచరించువాడే బ్రాహ్మణుడని ప్రసిద్ధి చెందును. బ్రాహ్మణునకు శమము అధ్యయనము పరమ ధనములు. ఇవియే ధర్మ గతికి సాధనములు. నీవు కేవల స్వాధ్యాయ పరుడవే కాని ధర్మసూక్ష్మత నెరుగవు. కావున మిథిలానగరమునకు వెళ్ళి సత్యవాదియు, జితేంద్రియుడునయిన ధర్మవ్యాధునికడ కరిగి సకల ధర్మములను తెలిసికొనుము.'' అని పలికెను.

కౌశికుడు ఆ పతివ్రతాతిలకము మాటలకు సంతసించి ''తల్లీ! నీ పతిభక్తి ప్రశంసనీయమైనది. నా చిత్తము ప్రశాంతమైనది. నీకు సర్వశుభములు చేకూరును గాక!'' అని దీవించి వెడలి పోయెను.

పతి పాద సేవాపరాయణులైన మానినీమణులను పరుల కోపతాపములు ఏమియు చేయ నేరవుగదా! కావున పండితులైనను కామ క్రోధములను జయింప గలిగినవారే వంద్యులు.



## దైవస్తుతి

ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదామ్,
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్.

## భాస్కరా!

పట్టువ నిత్యమున్ మదముఁబట్టి మహాత్ముల తూలనాడినం
బట్టిన కార్యముల్ చెడును, బ్రాణము పోవు, విరధ దోషముల్
పుట్టు, మహేశుఁగాదని కుబుద్ధి నొనర్చిన యజ్ఞతంత్రముల్
ముట్టకపోయి - దక్షునికి మోసము వచ్చెగదయ్య భాస్కరా!

భావము : పట్టుదలతో మదాంధుడై మహాత్ములను నిందించినచో చేపట్టిన కార్యములు చెడిపోవును. ప్రాణమునకు ముప్పువచ్చును. యజ్ఞ సమయమునందును ఈశ్వరుని కాదని తూలనాడిన దక్షుని యజ్ఞము భంగమగుటయే కాక చివరకు ప్రాణములనే కోల్పోయెను.

★★★★

# ద్రోణుడు

ద్రోణుడు ధర్మ తత్వజ్ఞుడు. భరద్వాజముని కుమారుడు. శుక్రవంశమున పుట్టిన పుణ్యమూర్తి. సకల శస్త్రాస్త్ర కోవిదుడు. ద్రుపదుని బాల్యమిత్రుడు.

ద్రోణ ద్రుపదులు ఇరువురు కలిసి వేదాధ్యయనము చేశారు. కొంత కాల మనంతరము ద్రుపదుడు పాంచాల దేశమునకు రాజయ్యెను. ఒక నాడు ద్రోణుడు ద్రుపదుని వద్దకు ధనార్థియై వెళ్ళి ''నేను నీ బాల్య సఖుడను. ద్రోణుడను. సహాధ్యాయుడనైన నన్ను నీ వెరగవా?'' అని ప్రణామపూర్వకముగా పలికెను. రాజ్యమదాంధుడైన ద్రుపదుడు ఆ పలుకులు సహింపలేక ''దరిద్ర బ్రాహ్మణులకు ధారుణీశులకు సఖ్య మెక్కడ? నెయ్యము కయ్యము వియ్యము సమానమైనవారికి మాత్రమే సంభవించును. కటిక దరిద్రుడవైన నీ వెక్కడ? మహారాజునైన నేనెక్కడ?'' అని పలికెను.

ఐశ్వర్య గర్వముతో పలికిన ద్రుపదుని పలుకులకు ద్రోణుడు మిగుల అవమానమును చెంది, భార్యా పుత్రులతో శిష్యగణముతో హస్తినాపురమున కరిగెను. హస్తినాపురమున భీష్మునితో తన అవమాన వృత్తాంతము చెప్పగా, అతడు కురు పాండు కుమారులను చూపి వారిని శిష్యులుగా సమర్పించెను. వారిని ద్రోణుడు ''నా ఇష్టమైన కార్యమును మీలో నెవరు కావింతు''రని అడిగెను. కౌరవులు మిన్నకుండిరి. పాండవులలో ఇంద్రసుతుడైన అర్జునుడు అతని ఇష్టకార్యమును ఒనర్చెదనని పలికెను. ఆచార్యుడు అతి స్నేహముతో అర్జునుని కౌగిలించుకొని, రాజకుమారులకు విలువిద్యా రహస్యములన్నియు నేర్పెను.

ఒకనాడు ద్రోణుడు శిష్యులను రావించి ''నాకు గురుదక్షిణ ఇం''డనగా అందరు మ్రొక్కి నిలిచి ''మీ కేది ఇష్టమైన కార్య''మని అడిగిరి. అవివేకి, ఐశ్వర్యమదాంధుడైన ద్రుపదుని పట్టి తెండని ద్రోణుడు వారిని ఆజ్ఞాపించెను. ''ఈ క్షణమే ఆ ద్రుపదుని పట్టితెత్తు'' మని పలికి కౌరవులు రథము లెక్కి వివిధ ఆయుధములతో దిక్కులు పిక్కటిల్లునట్లు భేరీ నినాదములు కావించుచు వెళ్ళిరి.

అర్జునుడు ద్రోణుని సమీపించి "ఆచార్యోత్తమా! కౌరవులు ద్రుపదుని పట్టి తెచ్చుటకై వెళ్ళిరి. కాని ద్రుపదుని ముందు వీరి గర్వము నశింపక తప్పదు. అతడు ధనుర్విద్యా విశారదుడు. మీ సఖుడను విషయము వీరికి గుర్తు లేదు కాబోలు." అని పలికెను.

దుర్యోధనాదులు పాంచాలుని పురమున కరిగిరి. నానావిధ శరములతో ద్రుపదుడు కురువీరులపై విజృంభించెను. అతని పరాక్రమమునకు భయపడి, వాని ముందు నిలువజాలక వెనుదిరిగి వచ్చిరి. అర్జునుడు గురువునకు నమస్కరించి భీమసేనుడు సేనాగ్రచరుడుగా, నకుల సహదేవులు రథచక్ర రక్షకులుగా, ద్రుపదుని సేనాసము ద్రముపై విరుచుకపడెను. భీమసేనుని గదా ఘాతములకు ద్రుపద సైన్యము నుగ్గు నూచయయ్యెను. అర్జునుడు ప్రళయకాలమునందలి యమునివలె పాంచాలురను ఎదుర్కొని, ద్రుపదుని రథము మీదికి లంఘించి వానిని బట్టి తెచ్చి ద్రోణునకు గురుదక్షిణగా సమర్పించెను.

ద్రోణాచార్యుడు అర్జునుని పరాక్రమమునకు పరమ సంతుష్ట హృదయుడై చూచి నవ్వుచూ "ఓహో ద్రుపద మహారాజులు పాపము - వీరికెట్టి దశపట్టినది! యిప్పటికైనా రాజ్యమదాంధకారము వీడిపోయినదా రాజా! ఇకనైన మేమెవరమో గుర్తుంచుకొనుము" అని పలికి వానిని బంధవిముక్తుని కావించి పంపెను. ద్రుపదుడు ద్రోణుని చేత పాశవిముక్తుడై ఆ పరాభవమునకు దుఃఖించుచు వెడలిపోయెను.

ఐశ్వర్య గర్వముతో కన్నుమిన్నుగానని వానికి తత్ఫలమును అనుభవింపక తప్పదు. అంతేకాక ఎరిగియు వివిధ విద్యావిశారదులగు మిత్రులను అవమానించు వారికి ఎట్టి శిక్ష లభించునో ద్రుపదుని చరితము తెలుపును.

★ ★ ★ ★

## దైవస్తుతి

సర్వసతి ! నమస్తుభ్యం
వరదే ! కామరూపిణి
విద్యారంభం కరిష్యామి
సిద్ధిర్భవతు మే సదా

## భాస్కరా!

దానము సేయఁబోయిన వదాన్యున కీయఁగ శక్తిలేనిచో
నైనఁ బరోపకారమునకై యొక దిక్కునఁ దెచ్చియైన నీఁ
బూనును, మేఘుఁ డంబుధికిఁ బోయి జలంబులు తెచ్చి యీయఁడే
దాన సమస్త జీవులకు వాంఛిత మింపెసలార భాస్కరా!

**భావము :** భాస్కరా! దానము చేయగోరు దాత, తన కడలేకున్నచో పరోపకారమునకై ఇతరుల దగ్గరకు వెళ్ళి తెచ్చియైన దాన మొనర్చును. ఎట్లనగా, మేఘము సముద్రము దగ్గరకు వెళ్ళి నీరు తెచ్చి సమస్త జీవులకు సంతోషము కలుగునట్లు వర్షము నిచ్చున్నది గదా!.

★★★★

# విక్రమార్కుడు

విక్రమార్క చక్రవర్తి బలపరాక్రమ సంపన్నుడు. ఆయన వితరణమునకు గని. వివేకమునకు స్థానము. సజ్జనులకు సంతోషమును కలిగించుచు శత్రుజనులకు దుర్నిరీక్ష్యుడై విక్రమార్కుడు ఉజ్జయినీ నగరమును పాలించుచుండెను.

ఆ భూపాలుడు ఒకనాడు మృగయా వ్యాపారార్థమై అడవికి వెళ్ళి భీకర మృగములను వేటాడి, మిక్కిలి అలసిపోయి ఒక చెట్టు క్రింద శయనించెను. ఇంతలో దేవదత్తుడనే బ్రాహ్మణుడు అచటికి వచ్చి, చక్రవర్తి తనూ సౌందర్యమును గాంచి చేతికుండికా జలములతో వాని సేదతీర్చెను. విక్రమార్క చక్రవర్తి నిజపురమునకు అరిగి, మరునాడు వానిని పిలిచి రాజ పురోహితునిగా నియమించెను. ఒకనాడు కొలువులో ప్రసంగవశమున అడవిలో తనకు చేసిన ఉపకారమునకు బ్రాహ్మణునికి ప్రత్యుపకార మేదైన చేయవలెను. ఆ రోజు ఎప్పుడు వచ్చునో - అని పలికెను. దేవదత్తుడు చక్రవర్తి సన్నిహితుడై, ఆతని వర్తనముతో సత్కీర్తి పొందెను. ఇట్లుండగా ఒకనాడు సర్వాభరణ భూషితుడై ఆడుకొనుచున్న రాజకుమారుని ఎవరు చూడకుండ తన ఇంటికి గొనిపోయెను. రాజభటులు పట్టణములో సర్వమును శోధించి రాజకుమారుని జాడ కనుగొనలేకపోయిరి. ఇంతలో అంగడిలో ఆభరణములను అమ్ము బ్రాహ్మణుని పట్టితెచ్చి రాజ సమ్ముఖమున ఉంచిరి.

విక్రమార్కుడు విప్రునితో సముచితముగా సంభాషించి నిజము చెప్పుమని కోరెను. అలంకారములపట్ల ఆసక్తితో రాజకుమారుణ్ణి వధించితిని ఆ విప్రుడు సమాధానమిచ్చెను. సభలోని వారందరు అట్టి దుష్కృత్యమొనర్చిన వానిని సహింపరాదని పల్కిరి. కృపలేక నృపకుమారుని వధించిన వానిని శిక్షించుటకై భటులు వానిని ఈడ్చుకొని పోవుచుండగా విక్రమార్కుడు వారిని తిరిగి కొలువునకు పిలిపించి అందరు వినుచుండగా "ఈతడు మున్ను వనములో పడిపోయి ఉన్న నాకు ప్రాణదానము చేసినవాడు. కాబట్టి వీడెంత అపకారము చేసినను

సహించుటయే ధర్మము. ఆనాడు అతడు సహాయము చేయకున్నచో నాకీ విభవ మెక్కడిది? ప్రాణదానము చేసిన వాని ప్రాణములు తీయు నీచున కెట్టి పాపము వచ్చునో–'' అని పలికెను. రాజు సభ్యవచనములకు సభ యంతయు మిక్కిలి సంతసిల్లెను.

ఆ విప్రుడు పరుగున తన ఇంటికి వెళ్ళి, దాచి ఉంచిన రాజకుమారుని సమర్పించి ''మహా ప్రభూ! నాపట్ల కరుణతో నాకు సన్మానము చేయవలెనని చక్రవర్తులు భావించుచున్నారని ఆ నోట, ఈ నోట వింటిని. యధార్థమును తెలిసికొనుటకై ఇట్లు చేసితిని'' అని విన్నవించెను.

విక్రమార్కుడు ఆశ్చర్యపడి ఆ బ్రాహ్మణునకు అనేకములగు మణి భూషణములను బహూకరించెను. ప్రభువు ఔదార్యమునకు సభ్యులు విస్మయమొందిరి. సత్యవచన ప్రత్యుపకార పరాయణుడైన విక్రమార్కుడు పెక్కేండ్లు పరిపాలన మొనరించెను.



## 29

### దైవస్తుతి

మాణిక్యవీణా ముపలాలయంతీం
మదాలసాం మంజుల వాగ్విలాసామ్
మహేంద్ర నీలద్యుతి కోమలాంగీం
మాతంగ కన్యాం మనసా స్మరామి.

### కుమారీ!

కొన్నాళ్ల సుఖము! కష్టము
కొన్నాళ్లఁ భుజింపకున్నఁ గొరగాదు సుమీ!
పున్నమ దినముల వెన్నెల,
యెన్నంగ నమాసలందు నిరులు కుమారీ!

భావము : కొన్ని రోజాలు వెన్నెల, కొన్ని రోజాలు చీకటి యుండును. అట్లే కష్టసుఖములు మనకు కావడి కుండల వంటివి. కావున నీకు లేమి సంభవించినను కష్టముగా నెంచుకొనక, ఓపిక పట్టినచో సుఖము వచ్చును.

★★★★

# యదువంశము

శ్రీకృష్ణుని జననంవల్ల యదువంశం ప్రసిద్ధి కెక్కింది. అపార గౌరవం లభించింది. అంతేగాక మహాభారత సంగ్రామంలో యదువీరులు ఘనత కెక్కారు. వారిలో ముఖ్యులుగా సాత్యకి, కృతవర్మ, ప్రద్యుమ్నుడు విఖ్యాతులయ్యారు. వాసుదేవుడు సర్వవంద్యుడగుటవలన వారి అహంకారానికి హద్దులు లేకుండా పోయినాయి. పెద్ద పిన్న తారతమ్యం నశించింది. ఈ విధంగా కుకుర, అంధక, వృష్ణి, భోజవంశీయులు ఎవరికి వారే ఘనుల మనుకొనసాగారు.

ఒక నాడు దూర్వాసాది మహర్షి బృందము శ్రీకృష్ణ దర్శనమునకై ద్వారకా నగరం వచ్చారు. ఆ తపోధనులను చూచిన యాదవులు భక్తి భావంతో వారికి నమస్కరించి గౌరవించకపోగా ఆ జడదారులను చూచి తేలికభావంతో పరిహాసం చేయబుద్ధి కల్గింది. ''వినాశకాలే విపరీత బుద్ధిః'' అన్నట్లు ఆ యదు బాలకులు సాంబునికి స్త్రీ వేషం వేసి ఆ ఋషుల వద్దకు తీసుకుని వెళ్ళారు. అందొకడు వినయం నటిస్తూ నమస్కరించి ''స్వామీ! ఈ అమ్మాయికి కలిగే బిడ్డ ఆడపిల్లా! మగపిల్లవాడా చెప్పండి'' అని అడిగారు. తపోఘనుడైన దుర్వాసుడు విషయం గ్రహించాడు. గర్వంతో మదాంధులై పెద్ద పిన్న తారతమ్యంలేక ఆ యాదవ బాలకులు తనను పరిహసించడానికే అట్లు చేశారని ''యాదవ కులాన్ని నాశనం చేయు ముసలం పుడుతుంది.'' అని చెప్పాడు. ఋషి వాక్యం అసత్యం కానేరదు. దుర్వాసుడు అన్నట్లే సాంబుని కృత్రిమ గర్భం నుండి ముసలం పుట్టింది. వారు ఆ ముసలాన్ని పట్టి వాసుదేవునికి చూపి సలహా అడిగారు. వాసుదేవుని అనుజ్ఞ ప్రకారం నది ఒడ్డున దానిని అరగదీసి ఆ పొడిని నీటిలో కలిపారు. ఆఖరున మిగిలిన చిన్న ముక్కను నదిలో విసిరివేసారు. నదితీరంలో తుంగ మొలిచింది.

ఒక ఉత్సవ సమయంలో యదు, వృష్టి, భోజ, అంధక వంశీయులందరు నదితీరాన విహరించి తప్ప త్రాగి పరిహాస ప్రసంగాలు ప్రారంభించారు. తర్వాత అది సూటి పోటి దెప్పి పోటులుగా మారింది. ఆగ్రహాలు పెచ్చు పెరిగాయి.

మద్యపాన మత్తులైనవారు తాము ఏమి చేస్తున్నదీ తెలియకుండా ఒకరిపై ఒకరు కలియబడ్డారు. దట్టంగా పెరిగిన తుంగను పీకి ఒకరి నొకరు బాదుకుని మరణించారు. శేషించిన ముసల భాగాన్ని పొందిన బోయవాడు దానిని బాణంగా తయారుచేసి విడువగా అది వాసుదేవునికి తగిలి ఆయన కన్ను మూశాడు.

గర్వోన్మత్తతతో పెద్దలను పరిహసించుట యదువంశ నాశనానికి దారితీసింది. అందువలన మనం పెదల యడ వినయము, భక్తి కలియుండాలి.

★★★★

సర్వశాస్త్రమయీ గీతా సర్వదేవ మయోహరిః
సర్వతీర్థమయీ గంగా, సర్వవేదమయో మనుః

★★★★

## దైవస్తుతి

మనోజవం మారుత తుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్,
వాతాత్మజం వానరయూధ ముఖ్యం
శ్రీరామ దూతం శిరసా నమామి||

## కుమారా!

విత్తంబు, విద్య, కుల, ము
న్మత్తులకు మదం బొసంగు; మాన్యులకున్ స-
ద్వృత్తి నొసంగును, వీనిం
జిత్తంబున నిడి మెలగఁ జెలఁగుఁ, గుమారా!

**భావము :** కుమారా! ధనము, విద్య, కులము - అను ఈ మూడును దుర్మార్గులకు గర్వమును కలిగించును. ఈ మూడే సజ్జనులకు మంచి నడవడిని కలుగజేయును. కాబట్టి ఈ విషయమును గుర్తుంచుకొని మెలగ వలయును.

★★★★

## 30

### దైవస్తుతి

మనోజవం మారుత తుల్యవేగం
జితేంద్రియం బుదిమతాం వరిషమ్,
వాతాత్మజం వానరయూధ ముఖ్యం
శ్రీరామ దూతం శిరసా నమామి॥

**కుమారా!**

విత్తంబు, విద్య, కుల, ము
న్మత్తులకు మదం బొసంగు; మాన్యులకున్ స-
ద్వృత్తి నొసంగును, వీనిం
జిత్తంబున నిడి మెలగఁ జెలఁగుఁ, గుమారా!

**భావము :** కుమారా! ధనము, విద్య, కులము - అను ఈ మూడును దుర్మార్గులకు గర్వమును కలిగించును. ఈ మూడే సజ్జనులకు మంచి నడవడిని కలుగజేయును. కాబట్టి ఈ విషయమును గుర్తుంచుకొని మెలగ వలయును.

★★★★

నీయనిచో సముద్రమును లంఘించిన హనుమంతునివలె నిన్నును ఈ పర్వతమును లంఘించి వెళ్లగలను.'' అని పలికాడు గర్వంగా. భీమసేనుని మాటలు విని ''అయ్యా! ముసలివాడను. లేవలేను. నీవు పోవలెనన్నచో నా తోకను లేవనెత్తి ప్రక్కన పడవైచి పొమ్ము'' అని పలికెను. భీముడు వెంటనే తన వామహస్తమున అతని తోక నెత్తబోయెను. కాని అది అంగుళము ఎత్తుకూడ లేవలేదు. అలా కాదని రెండు చేతులతో ఎత్తడానికి ప్రయత్నించాడు. తన బలమంతా ఉపయోగించి ప్రయత్నించినా తోక జానెడెత్తు లేవలేదు. శరీరమంతా చెమటతో తడిసిపోయి, శక్తి ఉడిగి, అవమానంతో, హనుమంతుడికి నమస్కరించి ''మహానుభావా! నీవు కపి రూపధరుడవైన సిద్ధుడవో గంధర్వుడవో, కావలెను గాని సామాన్యుడవు కావు. నీవెవరివో నా కెరిగింపుము'' అని ప్రార్థించెను. హనుమంతుడు నవ్వుచు ''నేను వాయుదేవుని కుమారుడను హనుమంతుడను. మన మిరువురము సోదరులము. నీ శక్తిని పరీక్షించుటకే ఇట్లు చేసితిని. శ్రీరామచంద్రుడు రావణుని సంహరించి నా కడకువచ్చి, ''ఎంతకాలము లోకమున రామకథలు నిలుచునో అంతకాలము నీవు అమరుడవై ఉందువు'' అని వరమిచ్చినాడు అని పలికెను. భీముడు ''మహానుభావా! నీ దర్శనమున కృతార్థుడనైతిని'' అని పలికి ప్రణామ మొనర్చెను.

హనుమంతుడు భీమునకు తన పూర్వ రూపమును చూపి కరుణించెను. ''భీమసేనా! రణమధ్యంబునందు నన్ను తలచుకొని శత్రువుల నిర్జింపుము. నేను అతిరథుడైన అర్జునుని రథ ధ్వజంబు నుండి మీ బలపరాక్రమములను చూతును'' అని భీముని కౌగిలించుకొని, వానికి సౌగంధిక సరోవర మార్గమును చూపి హనుమంతుడు అదృశ్యుడయ్యెను.

ఆంజనేయుని అనుగ్రహముతో అనంతరము భీమసేనుడు యక్షరాక్షసులను వధించి, కుబేరుని జయించి సౌగంధిక పుష్పములను గొని వచ్చి ద్రౌపదికి బహూకృతిగా ఒసంగెను.



## దైవస్తుతి

యజ్ఞేశాచ్యుత గోవింద
మాధవానంత కేశవ।
కృష్ణ విష్ణో హృషీకేశ
వాసుదేవ నమోస్తుతే।

## కుమారీ!

సుమతియును చంద్రమతియును
దమయంతియు జానకియును ద్రౌపదియును వి
ఘ్నములఁబడి పతి భక్తిం
గ్రమమున నడుపుటలు తలఁపఁగాదె కుమారీ!

**భావము :** సుమతీదేవియు, చంద్రమతి, దమయంతి, సీతాదేవి, ద్రౌపది మున్నగు పతివ్రతలు ఎన్ని కష్టములు అనుభవించినను పతిభక్తిని విడనాడ లేదు. అట్లే నీవును నడుచుకొనవలయును.

★★★★

# అహల్య

గౌతమ మహర్షి విశిష్ట తపోసంపన్నుడు. ఇంద్రసమ తేజస్వి. ఆయన ధర్మపత్ని అహల్య. ఆమె అందాల ప్రోవు. బ్రహ్మదేవుడు అతి ప్రయత్నముతో సృష్టించినది ఆమె అతిమానుష రూపము. ఆమె రూప లావణ్యములు మహేంద్రుని కూడ సమ్మోహనం చేశాయి. గౌతమ మహర్షి అహల్యతో బహుకాలం తపస్సు చేశాడు. భక్తితో భర్తను సేవించిన అకలంక చరిత అహల్య.

వసంత ఋతుశోభతో ప్రకృతి పులకించింది., నయన పర్వంగాను, మనో హరంగాను ఆశ్రమం ఉంది. ప్రకృతిశోభ, ఆశ్రమ సౌందర్యము, అందరి మనస్సులలో కోర్కెలను రేపుతున్నాయి. మహర్షి ఇంద్రియాలను జయించి కఠోర నియమాలతో తపస్సు చేస్తున్నాడు. స్వర్గాధిపతి ఆమెను పొందు కోరికతో గౌతముని ఆశ్రమానికి అర్ధరాత్రి వేళ వచ్చాడు. మాయా కుక్కుట రూపంలో ''కొక్కరోకో!'' అని అరచాడు. గౌతముడు స్నానార్థము ఆశ్రమాన్ని విడచివెళ్ళాడు. ఆ సమయాన మహేంద్రుడు ఆశ్రమంలోనికి తన నిజరూపంతో ప్రవేశించాడు. ఒంటరిగా ఉన్న అహల్యకు తన కోరికను తెలియ చెప్పాడు. రమణీయ ప్రకృతి వలన కలిగే ఉద్వేగము దేవరాజు సౌందర్యము ఆమె బుద్ధిని బుగ్గి చేశాయి. స్వర్గాధిపతి అంతటివాడు తనని కోరుతున్నందుకు మురిసిపోయి అతని కోరికను మన్నించి తన సతీత్వాన్ని అగ్ని పాలుచేసింది.

సంతుష్టుడైన మహేంద్రుడు ఆశ్రమాన్ని విడిచి బయల్దేరాడు. నదీ తీర్థములో స్నానం చేసి ఒకచేతిలో సమిధలూ, ఒక చేతిలో దర్భలూ పట్టుకొని అగ్నిహోత్రుని వలె ప్రకాశిస్తూ గౌతముడు ఎదురయ్యాడు. ఆ తపోసంపన్నుణ్ణి, దేవదానవులు ఎదిరించలేని ఆ శక్తివంతుణ్ణి, చూచి దేవేంద్రుడు భయంతో గడగడ వణకిపోయాడు. ముఖం వెలా వెలా పోయింది. మహేంద్రుని తేరిపారచూచిన ఆ తపోధనునకు ఆ దుర్వృత్తము అంతా గోచరించింది. పరమక్రుద్ధుడై – ''ఓ దుర్మతీ! నీవు చేయరాని పనిచేశావు. నీ అండములు తెగిపోవలెను.'' అని శపించాడు. అహల్యను చూచి ''ఈ ఆశ్రమ పదము పాడుపడి పోవలెను. దుర్వృత్తికి లోనైన నీవు కూడ నీళ్ళు లేకుండా బండరాయి రూపంతో దుమ్ములో దొర్లుతూ ఎవరికంటనూ పడకుండా ఇక్కడే పడి ఉండు'' అని శపించాడు. తన అకృత్యమును గ్రహించిన అహల్య రోదించింది. ఆ మహర్షి కాళ్ళ వేళ్ళపడి వేడుకుంది. గౌతముడు కొంత శాంతించి- ''ఓ అహల్యా! పశ్చాత్తాప తప్తురాలవైన నీవు తపస్సు చేయి. శిక్షను అనుభవించు, కొంతకాలానికి దశరథరాముడు ఇక్కడకు

వస్తాడు. నిన్ను చూస్తాడు. అతని దర్శనమాత్రంచేత నీవు పరిశుద్ధురాలవు అవతావు. అతని పాదధూళి స్పర్శ వలన నీకు నిజరూపం కలుగుతుంది. అప్పుడు నీవు భయమోహ వివర్జితవు అవుతావు. ఆ పరమ పురుషునకు నీవు అతిథి సత్కారములు చేయవలెను. తర్వాత నీవు నాతో సుఖంగా ఉండవచ్చును.'' అని అనుగ్రహించి హిమవత్పర్వత శిఖరానికి వెళ్ళి పోయాడు.

విశ్వామిత్రుని యాగ సంరక్షణము అయిన తర్వాత విశ్వామిత్రుని వెంట రామలక్ష్మణులు మిథిలానగరానికి వెళ్ళుతూ పాడుబడిన గౌతమ ఆశ్రమానికి వచ్చారు. ఆమె నిజరూపాన్ని పొందింది. ఆమె తపస్సుకు అందరూ మెచ్చుకున్నారు. అహల్య రామలక్ష్మణులకు సాష్టాంగ నమస్కారముచేసి అర్ఘ్యపాద్యాదులు ఇచ్చి పూజించింది. రామ దర్శనంతో ఆమె పాపం నుంచి, శాపం నుంచి విముక్తురాలు అయినది.

నిజమైన పశ్చాత్తాపము ఎటువంటి పాపాన్ని అయినా హరించి వేయగలదు అనుటకు అహల్య జీవితం ఒక ఉదాహరణ.



32

## గురుస్తుతి

హర లీలావ తారాయ
శంకరాయ పరౌజసే
కైవల్య కలనా కల్ప
తరవే గురవే నమః

## భాస్కరా!

తరవఁగరాదు దుష్ట గుణుఁ దత్త్వ మెరుంగక నెవ్వరైన నా
చెరుగుణ మిట్లు వల్దని చెప్పినఁ గ్రక్కున గోపచిత్తుఁడై
కడుఁ దెగజూచుగా నమరగాగిన తైలము నీటిబొట్టుపైఁ
బడునెడ నా క్షణం బెగసి భగ్గున మండకయున్నె భాస్కరా!

భావము : దుష్టుడైనవాని తత్త్వమును తెలిసికొనక, వానితో సంబంధము పెట్టుకొనరాదు. వాని దుష్ప్రవర్తనమును మానుకొనుమని చెప్పినచో ఒక్కసారిగా విరుచుకు బడును. ఎట్లనగా, సల సల క్రాగిన నూనెలో ఒక నీటిచుక్క బడినచో తక్షణమే విజృంభించి భగ్గుమని మండును.

★★★★

# విశ్వామిత్రుడు

విశ్వామిత్రుడు గాధి అను కుశవంశపు రాజనందనుడు. అందువలన అతనికి గాధేయుడు, కౌశికుడు అను పేర్లు ఉన్నవి. విశ్వామిత్రుడు సర్వశాస్త్రములు చదువుకున్నవాడు. మహాపరాక్రమవంతుడు. పరమ ధార్మికంగానూ, ప్రజాహితంగానూ బహుకాలం రాజ్యపాలన చేశాడు. ఒకసారి చతురంగ బలములు కల ఒక అక్షౌహిణీ సైన్యంతో దేశాటన చేశాడు. అనేక పుణ్యతీర్థాలు, పట్టణాలు, ముని ఆశ్రమాలు చూచుకుంటూ వసిష్ఠ మహర్షి ఆశ్రమానికి వచ్చాడు.

అత్యంత రమణీయమైన ఆ ఆశ్రమం బ్రహ్మర్షులు, దేవర్షులు, సిద్ధులు, గంధర్వులు, కిన్నరులు మొదలగువారితో బ్రహ్మలోకంవలె ఉంది. విశ్వామిత్రుడు వినయ విధేయతలతో నమస్కారము చేశాడు. వసిష్ఠమహర్షి విశ్వామిత్రునికి స్వాగతము చెప్పి అతిథి సత్కారములు చేశాడు. ఉభయులు కుశల ప్రశ్నలు పరామర్శలతో సంతుష్టులైనారు. ''రాజా! నీకు నీ సైన్యానికీ యథావిధిగా ఆతిథ్యము ఇవ్వకోరుతున్నాను. నీవు చెప్పనలవి కానంతటి దొడ్డవాడవు. అతిథి శ్రేష్ఠుడవు. కాన నేను నిన్ను సత్కరించి తీరవలెను'' అన్నాడు మహర్షి. విశ్వామిత్రుడు ''మహర్షీ! తమ ప్రియవాక్యాలవల్ల పుణ్యదర్శనం వలన నాకు అతిథి సత్కారాలు సమకూరినవి. నన్ను తాము స్నేహంతో చూస్తూ ఉంటే చాలును. నమస్కారము'' అంటూ పోబోయినాడు. మహర్షి పట్టుబట్టగా విశ్వామిత్రుడు అంగీకరించాడు. వసిష్ఠుడు ''శబలా!'' అని పిలిచాడు. కామధేనువు వచ్చి ఆయన ఎదుట నిలబడింది. ''ఓ కామధేనూ! నేను ఈ విశ్వామిత్రునకు, అతని సైన్యానికీ భోజనం పెట్టి సత్కరించ దలుచుకొన్నాను. వారికి ప్రీతి కలుగునట్లు షడ్రసోపేతంగా వివిధ అన్నాలు సిద్ధం చేయవలెను.'' అని వసిష్ఠుడు కోరాడు. ఆ విందు వారికి తుష్టిని, పుష్టిని ఇచ్చింది.

పరమ సంతోషంతో విశ్వామిత్రుడు మహర్షిని సమీపించి ''ఓ బ్రహ్మర్షీ! తాము చాల చక్కగా సత్కరించారు. నా మాటను ఏదో సాకుతో త్రోసివేయక ఈ కామధేనువును నాకు ఇవ్వవలెను. దానికి బదులు కోటి గోవులను వేల కొలది ఉత్తమ అశ్వాలను, బంగారు రథాలను ఇస్తాను. ఇది మహారత్నము. మహారత్నాలన్నీ రాజుల సొమ్ము. కాబట్టి కామధేనువును తాము నాకు ఇవ్వవలెను'' అన్నాడు. వసిష్ఠ మహర్షి ''ఓ రాజా! నీవు ఏమి ఇచ్చినా నా శబలను ఇవ్వను. ఇదే నా సర్వస్వము. నా సర్వ సత్కర్మలకు ఇదే మూలాధారం. కాన దీనిని నేను ఇవ్వను'' అని నిష్కర్షగా చెప్పాడు. క్షత్రియ బలగర్వంతో విశ్వామిత్రుడు కామధేనువుని లాగుకొని పొమ్మని భటులను ఆజ్ఞాపించాడు. భటులందరను విదలించి శబల వసిష్ఠుని వద్దకు వచ్చి ''బ్రాహ్మణోత్తమా! నన్ను వదలివేసినావా? నేనేమి అపకారం చేశాను? ఈ రాజభటులు నన్ను ఎందుకు ఇట్లా లాగుకొని పోతున్నారు'' అంటూ

వాపోయింది. "శబలా! విశ్వామిత్రుడు క్షత్రియుడు. మహాబలవంతుడు. అక్షౌహిణీ సైన్యం వెంట ఉంది. తపోబలంతో నిగ్రహించవలెను, అనుకుంటే అతడు రాజు పైగా ఇప్పుడే ఆతిథ్యమిచ్చాను. నీవే ఆత్మరక్షణ చేసుకో" అని చెప్పాడు వసిష్ఠుడు. కామధేనువు 'అంబా' అని ఆక్రోశించింది. వెంటనే నందలకొలది సైనికులు పుట్టుకొచ్చారు. వారు విశ్వామిత్రుని సైన్యాన్ని నాశనము చేసివేశారు. విశ్వామిత్రుని నూరుగురు కుమార్లు కుపితులు అయినారు. వివిధ ఆయుధాలతో వశిష్ఠ మహర్షి మీదకు పోయినారు. తనపై పడవస్తున్న రాకుమారులను చూచి మహర్షి హుంకారం చేశాడు. రాకుమారులు వారి బలగాలతో భస్మము అయిపోయినారు.

అది అంతా చూచి విశ్వామిత్రుడు ఖిన్నుడైనాడు. రెక్కలు విరచిన పక్షివలె దీనుడైనాడు. అతని దర్పము, ఉత్సాహము హతమై పోయినాయి. పట్టరానంత దుఃఖము కలిగినది. మిగిలి ఉన్న ఒక్క కుమారునికి రాజ్యం అప్పగించి హిమాలయ పర్వతానికి పోయాడు. అచట శివుని గూర్చి ఘోరమైన తపస్సు చేశాడు. ప్రత్యక్షమైన ముక్కంటి నుండి సాంగోపాంగముగ సమస్త ధనుర్వేదాన్ని గ్రహించాడు. సహజంగానే బలగర్వితుడైన విశ్వామిత్రునికి ధనుర్విద్య సమస్తం కరతలామలకం కాగానే గర్వం పెచ్చు పెరిగింది. హుటాహుటిగా వశిష్ఠాశ్రమానికి వచ్చి ఆశ్రమంపై అస్త్రాలను కురిపించాడు. అస్త్ర జ్వాలలకు ఆశ్రమమంతా దగ్ధం కాసాగింది. ఇతర మహర్షులందరూ ఆ వేడికి తట్టుకోలేక పారిపోయారు. ఆశ్రమమంతా కాలిపోయి శూన్యమైన ఎడారిగా అయిపోయింది. "మూఢుడా! ఎంతోకాలం నుండి పెంచిన ఈ మున్యాశ్రమాన్ని నాశనం చేశావు. నీవు దురాచారుడవు" అంటూ మహర్షి తన బ్రహ్మదండంతో ఎదురునిలిచాడు. విశ్వామిత్రుడు పరమ భాస్వరములైన దివ్యాస్త్రాలెన్నింటినో వదిలాడు. వశిష్ఠుడు వాటన్నింటినీ ముల్లోకాలు ఆశ్చర్యపోయేటట్లు తన బ్రహ్మదండంతో రూపుమాపాడు. విశ్వామిత్రుడు తుదకు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించగా అది బ్రహ్మదండాన్ని దాటి మహర్షి మీదకు పోయింది. ఆయన తన బ్రహ్మ విద్యాబలంతో దాన్ని మింగివేశాడు. బ్రహ్మాస్త్రాన్ని మింగినందువలన ఆయన ప్రతి రోమకూపం నుండి పొగలులేచి మంటలు మండి వసిష్ఠుడు భయంకర రూపుడైనాడు. ఆ రూపానికి ముల్లోక వాసులు నిశ్చేష్టులు అయినారు. మహామునులు అందరూ వచ్చి "ఓ బ్రాహ్మణోత్తమా! తమ బలము అమోఘము. బ్రహ్మాస్త్రతేజాన్ని తమతోనే ఉంచుకోవలెను. లేకపోతే ఈ లోకాలన్నీ వ్యథలపాలౌతాయి. తమరు ప్రసన్నులు కావలెను." అని ప్రార్థించారు. వసిష్ఠుడు శాంతించాడు.

"ఎందుకు ఈ క్షత్రియ బలము. ఇది వ్యర్థమైనది. బ్రహ్మబలమే బలము" అని గ్రహించాడు విశ్వామిత్రుడు.

★★★★

## దైవస్తుతి

వందే వందారు మందార
మిందు భూషణ నందనమ్,
అమందా నంద సందోహ
బంధురం సింధురాననమ్.

## భాస్కరా!

పూనిన భాగ్యరేఖ చెడిపోయిన పిమ్మట నెట్టి మానవుం
డైనను వాని నెవ్వరు ప్రియంబున( బిల్వరు పల్కరెవ్వటన్
దానది యెట్లకో యనిన తథ్యము, పుష్పము వాడి వాసనా
హీనత వొందియున్న యెడ నెవ్వరు ముట్టుదురయ్య భాస్కరా!

**భావము :** భాస్కరా! భాగ్యరేఖను కోల్పోయిన తర్వాత ఎట్టి మానవునితో అయినను ఎవ్వరును ప్రేమతో సంభాషింపరు. వానితో పలుకరు. ఇది సత్యము. ఎట్లనగా పుష్పము వాడిపోయి వాసనను కోల్పోయిన తర్వాత ఆ పుష్పమును ఎవరు ముట్టుకొందురు?

★★★★

# దుర్యోధనుడు

దుర్యోధనుడు ధృతరాష్ట్రుని పెద్ద కొడుకు. స్వాభిమాన గర్వాంధుడు. పాండవులన్న చెప్పరాని ద్వేషము. మాయాజూదంతో ఓడిపోయిన పాండవులు వనవాసం చేస్తున్నారు.

ధర్మజుని రాజసూయవైభవ ప్రాభవాలను చూచి అసూయ వహించిన దుర్యోధనుడు వనవాసం చేస్తున్న పాండవులను అవమానించాలని మార్గాలను అన్వేషిస్తున్నాడు. ఒక రోజున దుర్వాస మహర్షి పదివేల మంది శిష్యులతో దుర్యోధనుని సౌధానికి విచ్చేశాడు. రాజోచిత మర్యాదలతో దుర్వాసమహర్షికి అతిథి సత్కారాలు కావించాడు దుర్యోధనుడు. ఆ మహర్షి అతడు చేసిన అతిథి సత్కారాలకు ఎంతో సంతోషించి ఏదైనా వరము కోరుకోమన్నాడు. దుర్బుద్ధియైన దుర్యోధనుడు దుర్వాసుని కోపంతో పాండవులు నశించిపోవాలన్న తలంపుతో ''స్వామీ! తమరూ మా ఆతిథ్యం స్వీకరించినట్లే, అరణ్యంలో ఉన్న మా సోదరులయిన పాండవుల ఆతిథ్యం స్వీకరించి వారిని కూడా ఆశీర్వదించ'' మని ప్రార్థించాడు.

అపరాహ్ణకాలములో దుర్వాస మహర్షి తన శిష్యగణముతో అడవిలో ఉన్న పాండవుల కడకు వెళ్ళాడు. సూర్యభగవానుడు ప్రసాదించిన అక్షయపాత్ర ప్రభావంతో అరణ్యవాసం చేస్తున్న పాండవులు, మహర్షులకు బ్రాహ్మణులకు ఆతిథ్యం ఇస్తూ వారి ఆశీర్వాదాలను పొందుతూ కాలక్షేపం చేస్తున్నారు. ఆ అక్షయపాత్రను రోజున కొకపర్యాయమే ఉపయోగించాలి. ద్రౌపది భోజనం చేసిన తర్వాత ఆ పాత్ర తిరిగి ఉపయోగపడదు. అందుచేత ద్రౌపది అతిథులందరూ భోజనం చేసిన అనంతరం భర్తలకు పెట్టి తాను భుజిస్తూ ఉండేది.

దుర్వాసమహర్షి శిష్యులతో వచ్చే సమయానికి ద్రౌపది భోజనం చేయడం పూర్తి అయింది. అకాలంలో వచ్చిన మహర్షికి ఆతిథ్యం ఇవ్వకపోతే ఆ మహానుభావుడికి కోపం వస్తుందేమోనని, ధర్మరాజు మామూలుగా వారినందరిని స్నానానుష్ఠానములను పూర్తి చేసుకొని దయచేయమని ప్రార్థించాడు. ఈ సంగతి ద్రౌపదికి చెప్పగా, ఆమె ఏమి చేయడానికి తోచక, దుర్వాస మహర్షి కోపతాపములకు గురి కావలసి వస్తుందేమోనని భీతచిత్తయై శ్రీకృష్ణ పరమాత్మణ్ణి ప్రార్థించింది.

భక్తజన వత్సలుడైన శ్రీకృష్ణ పరమాత్ముడు ఆమె ముందు సాక్షాత్కరించి తనకు ఆకలి అవుతున్నదనీ అక్షయపాత్రలో ఏమైనా ఉన్నదేమో చూడమన్నాడు. ద్రౌపది "శ్రీకృష్ణా! నేను పాత్రను శుద్ధిచేసిన తరువాత ఇంకా ఏమి మిగులును? దుర్వాసునికి తోడు నువ్వుకూడ నన్నేల పరీక్ష చేస్తావు" అని అడిగింది. శ్రీకృష్ణుడే ఆ పాత్రను తన కిమ్మని పరీక్షించి, దాని అడుగున ఉన్న అన్నం మెతుకు చూపించాడు. ఆ మెతుకును ఉదకంతో కలిపి తనకు పెట్టమన్నాడు. ద్రౌపది అట్లే చేసింది. కృష్ణుడు నీటితోసహా ఆ అన్నం మెతుకుని పుచ్చుకొని, దుర్వాసాదులకు తృప్తియగుగాక అని సంకల్పం చేశాడు. తరువాత భీముణ్ణి పిలిచి దుర్వాసుని, వారి శిష్యులను భోజనానికి పిల్చుకు రమ్మని పంపాడు. ఇంట్లో ఆహార పదార్థాలు లేకుండానే ఇలా అతిథులను పిలవమంటాడేమని ఆశ్చర్యపోతూ భీముడు మహర్షిని తీసుకురావడానికి వెళ్ళాడు. వెళ్ళి చూసేసరికి దుర్వాసుడు, శిష్యులు కడుపు నొప్పితో క్రిందపడి దొర్లుతున్నారు. "అయ్యా! మా కడుపు నిండి పొర్లిపోతున్నది. ఇక చాలు మీ ఆతిథ్యం. మేము రాలేక పోయినందుకు ధర్మరాజును క్షమించమని చెప్పు" అని చేసిన పనికి పశ్చాత్తాపమునంది అటునుండి వెళ్ళిపోయారు. పాండవులను అవమానించాలని, దుర్వాస శాపదగ్ధులను చేయాలన్న దుర్యోధనుడికి తిరిగి మరొక పరాభవం ఎదురైంది.

ధర్మశీలురను అవమానించాలని ప్రయత్నించిన వారికి ప్రతిఫలం మరొక పరాభవమే. భగవంతుడు భక్తవత్సలుడై ఎల్లప్పుడు భక్తుల కష్టములను పోగొట్టి వారిని రక్షించుచునే ఉండును.

★★★★

## దైవస్తుతి

హర శంభో మహాదేవ
విశ్వేశామర వల్లభ!
శివ శంకర సర్వాత్మన్
నీలకంఠ నమోఽస్తుతే.

## భాస్కరా!

ఘనుఁడగునట్టివాఁడు నిజకార్య సముద్ధరణార్థమై మహిన్
బనివడి యల్పమానవునిఁ బ్రార్థనసేయుట తప్పుకాదుగా;
అనఘతఁ గృష్ణ జన్మమున నా వసుదేవుఁడు మీఁద టెత్తుగాఁ
గనుఁగొని గాలిగాని కడకాళ్ళకు మ్రొక్కఁడె నాఁడు భాస్కరా!

భావము : గొప్పవాడు తన కార్యమును నెరవేర్చుకొను నిమిత్తమై నీచుడగువానిని ప్రార్థించినను అది తప్పు కానేరదు. ఎట్లనగా, పూర్వము వసుదేవుడు, శ్రీకృష్ణుడు పుట్టగానే వ్రేపల్లెకు గొనిపోవుచు వాని గాంచి ఓండ్రపెట్టు గాడిదవలన రహస్యము బయల్పడునేమో యని భావించి ఆ గాడిదకాళ్ళు పట్టుకొనెను.

★★★★

# శ్రీ కాళహస్తి

శ్రీ కాళహస్తి అనునది ప్రసిద్ధమైన పుణ్యక్షేత్రము. 'శ్రీ' అనగా సాలెపురుగు. 'కాళము' అనగా పాము. 'హస్తి' అనగా ఏనుగు. ఈ మూడు జంతువులు అకుంఠిత భక్తితో శివుని పూజించి ఆయనలో కలిసిపోయెను. అందువలననే ఆ క్షేత్రమునకు 'శ్రీ కాళ హస్తి' అను పేరు వచ్చెను.

పూర్వము ఒకానొక సాలెపురుగు తన పూర్వజన్మ వాసనా విశేషముచేత శివుని పూజించుచుండెడిది. సాలెపురుగు తన శరీరమునుండి దారములు తీసి శివునకు గుళ్ళు, గోపురములు, కొలువు కూటములు, కల్యాణ మంటపాదులు నిర్మించెడిది. వాయు ప్రభంజనము వలన తెగిపోయిన దారములను అంటించి తిరిగి వానిని కట్టుచుండెడిది. పరమ శివుడు సాలెపురుగు భక్తిని పరీక్షించుటకై, అచట ఒక దీపముండగా దానిని మండించి గుళ్ళన్నియు భస్మము కావించెను. సాలెపురుగునకు కోపము వచ్చి, తాను కట్టిన మందిరములను భస్మము కావించిన ఆ దీపమును మ్రింగబోయి మంటలో పడిపోయెను. శివుడు దాని భక్తికి మెచ్చి ప్రత్యక్షమై వరము కోరుకొనుమనెను. ఆ సాలెపురుగు స్వామీ! నన్ను నీలో ఐక్యమును కావించుకొను'' మని ప్రార్థించెను. శివుడు దానిని తనలో లీనము కావించుకొనెను.

ఒక పాము పాతాళము నుండి ప్రతి దినము మాణిక్యములను తెచ్చి శివలింగమును పూజ చేయుచుండెను. మరొక గజము ప్రతి దినము సువర్ణముఖీ నదిలో స్నానమొనర్చి తొండముతో మారేడు దళములను పువ్వులను గైకొనివచ్చి, పాము ఉంచిన మాణిక్యములను తీసివేసి స్వామిని సేవించుచుండెడిది. మరునాడు ఉదయమే పాము వచ్చి ఎవడో దుర్మార్గుడు ముళ్ళకంపలతో స్వామిని కప్పివేసినాడని వానిని త్రోసివేసి మరల రత్నమాణిక్యములతో పూజ చేసెడిది. మరల ఏనుగువచ్చి 'ఛీ' ఈ రాళ్ళేమిటని ప్రక్కకునెట్టి తాను పూలతో పూజించి వెళ్ళెను.

మరునాడు పామువచ్చి 'అయ్యో! నా పూజ అంతయు పాడైపోయినది. నా వ్రతము భగ్నమైపోయినది. ఎవడో దుర్మతి ఆకులను పూవులను స్వామిపై ఉంచినాడు' అని భావించి 'స్వామీ! నన్నిట్లు అవమానించుచున్న వాడెవడు? ముళ్ళకంపలు తెచ్చి నీ శిరసున ఉంచుచుండగా చూచియు నీవేల ఊరకుంటివి? అని వానిని త్రోసివేసి రత్నములతో పూజించి వెళ్ళెను. గజరాజు మనస్సు దుఃఖ పరితప్తమయ్యెను. ఆహారము మానివేసినది భార్యలతో జలక్రీడలాడుటలేదు. ఆ రాత్రి అంతయు జాగరము చేసినది.

పాము పూజించి వెళ్ళగానే ఏనుగువచ్చి 'నాపై పంతముపట్టి రాళ్ళ నుంచిన నీచుడెవరో!' అని తలంచి 'స్వామీ! ఈ రాళ్ళేమి? ఈ పూజలేమి? అవును. నీ నివాసమే పర్వతము. నీ భార్య పర్వతరాజ పుత్రి. నీ ఇల్లే ఒక కొండ. అందువల్ల రాళ్ళు రప్పలనిన నీ కిష్టము. అయినను నిన్ను దూషించిన ఏమి ఫలము? నా వ్రతహాని కావించిన దుర్మార్గుని రేపు ఉదయమే వచ్చి మట్టుపెట్టెదను' అని ఆగ్రహముతో వెడలిపోయెను.

తెల్లవారినది. పాము స్వామి దగ్గరకు వచ్చినది. మరల స్వామిపై ఆకులే కనిపించినవి. శత్రువుకోసమై ఆకులలో దూరి కూర్చుండెను. ఏనుగు కూడ పెందల కడనే వచ్చి స్వర్ణముఖీ జలమును తొండముతో తెచ్చినది. నిన్నటి పూలను తీసివేయుటకై తొండము సాచినది. పాము అదే సమయమని ఏనుగు తొండములో దూరి కుంభస్థలమును చేరి అక్కడ తిరుగుట అరంభించెను. గజరాజు బాధ అధికమయ్యెను. తొండమునుండి జలమును వేగముతో ఊదినది. పాము బయటకు రాలేదు. కుంభమును చెట్లకు మోదుకొనినది. సర్పము బయటపడలేదు. ఎన్ని విధముల ప్రయత్నించినను పాము బయటకు రాకపోవుట వలన ఇక తనకు మరణము తప్పదనియు, ఆ పామును కూడ చంపి తానును ప్రాణమును వీడుట వీరుల లక్షణమని తలచి కుంభమును కొండపై వేగముగా మోదెను. గజరాజు కుంభస్థలము బ్రద్ధలై పోయెను. లోపల ఉన్న పామును చిదికిపోయెను. స్వామి వారిరువురను తనలో కలుపుకొనెను.

శ్రీ, కాళ, హస్తుల, శివభక్తి తత్పరతను వ్యక్తము చేయుచు స్వామి శ్రీ కాళహస్తీశ్వర నామముతో వెలసి భక్తులను కరుణించుచుండును.



## 35

### దైవస్తుతి

శంఖ చక్ర గదా పాణే
ద్వారకా నిలయాచ్యుత
గోవింద పుండరీకాక్ష
రక్షమాం శరణాగతమ్.

### భాస్కరా!

లోకములోన దుర్గుల లోతు నెఱుంగక చేరరాదు, సు
శ్లోకుఁడు చేరినం గవయ మాతురు, చేయుదు రెక్కసక్కెముల్
కోకిలఁ గన్నచోటఁ గుమిగూడి యసహ్యపుఁ గూత లార్చుచున్
గాకులు తన్నవే తరిమి కాయము తల్లడమంద భాస్కరా!

**భావము :** భాస్కరా! లోకమునందు దుర్మార్గుల గుణము తెలియక మంచివాడు వారి ప్రక్కనే చేరరాదు. అట్లు చేసినచో వేళాకోళము చేసి కలియబడుదురు. ఎట్లనగా కోకిలను చూచిన కాకులన్నియు గుమిగూడి అసహ్యమగు కూతలు కూయుచు ఆ కోకిలను తన్ని తరిమివేయును గదా!

★★★★

# సుగ్రీవమైత్రి

సుగ్రీవుడు వానర రాజైన వాలి సోదరుడు. అసమాన బలపరాక్రమాలు, అఖండ ధైర్య సాహసాలు కలిగిన వాలి అధర్మంగా సుగ్రీవుని బాధించి రాజ్యం నుండి వెడలగొట్టాడు. అంతేగాక అతని భార్య రుమను అపహరించాడు. ధర్మమార్గానుసారులైన హనుమంతాది వానర శ్రేష్ఠులతో సుగ్రీవుడు ఋష్యమూక పర్వతంపై తలదాచుకున్నాడు.

రామానుగ్రహం వలన కబంధాకారము వదిలిపెట్టి దివ్యరూపము ధరించిన ''ధనువు'' ప్రేరణవలన రామ లక్ష్మణులు సుగ్రీవునితో స్నేహం చేయుటకు ఋష్యమూక పర్వత ప్రాంతానికి వచ్చారు. సీతా వియోగం వలన శ్రీరాముని మనస్స్వాస్థ్యం తప్పింది. పామరునివలె విలపించేవాడు. జానకి జాడ వారికి తెలియలేదు. లక్ష్మణుడు సమయోచితముగా చెప్పిన మాటలవల్ల దుఃఖాన్ని వీడి, ధైర్యాన్ని అవలంబించాడు. అన్నదమ్ము లిరువురూ సింహ కిశోరములవలె పంపా సరస్సు దాటి మనోహరములైన అరణ్యాలను అవలోకిస్తూ నడిచారు. సుగ్రీవ స్నేహకాంక్ష వారిలో ఉధ్రుతలూగుతోంది.

ఋష్యమూక పర్వతంపై విహరించే సుగ్రీవుడు ధనుర్బాణాలతో వచ్చే రామ లక్ష్మణులను చూచాడు. రాజ్యం నుండి వెడలగొట్టబడి, ప్రాణప్రియమైన భార్యను కోల్పోయి చింతిస్తున్నాడు సుగ్రీవుడు. దానికి తోడు బలవంతుడైన వాలితో శత్రుత్వము అతనికి మరింత భయాన్ని కల్గిస్తోంది. వాలి స్వయంగా ఋష్యమూక పర్వతానికి మతంగముని శాప భయంతో రాలేకపోయినా తనను చంపుటకు అనేక మందిని ఇదివరలో పంపాడు. ఆజానుబాహులైన రామ లక్ష్మణులు శర, చాప, ఖడ్గధారులై రావడం సుగ్రీవునకు భయం కల్గించింది. రామ లక్ష్మణులు కూడ వాలిచే పంపబడ్డ వారేనని అనుకొని తల్లడిల్లి పోయాడు. మంత్రులతో సంప్రదించాడు. హనుమంతుడు – ''ఓ సుగ్రీవుడా! నీకు ఇక్కడ వాలి వలన భయపడవలసిన అవసరంలేదు. నీకు మనోదార్ఢ్యముపోయి చపలుడవై నీ కోతి స్వభావం బయటపెట్టుకున్నావు'' అని మందలించి ధైర్యం చెప్పాడు.

మహా బుద్ధిమంతుడైన హనుమంతుడు సుగ్రీవాభిప్రాయం ప్రకారం భిక్షురూపంలో రామ లక్ష్మణులు ఉన్నచోటికి వెళ్ళాడు. వారికి నమస్కరించి యథావిధిగా పూజించాడు. మృదుమధురంగా మాట్లాడుతూ వారిని శ్లాఘించాడు. తనను పరిచయం చేసుకుని సుగ్రీవుడు వారితో స్నేహం కోరుతున్నాడని చెప్పాడు.

''లక్ష్మణా! ఈ సుగ్రీవ సచివుడు వాక్య విశారదుడు. ఋగ్యజుస్సామ వేదాలు మూడింటిని అధ్యయనము చేయనివాడు ఇతనివలె మాట్లాడ లేడు. వ్యాకరణ సంస్కారంతో మనోహరంగా మాటలు పలికాడు. ఇట్లా మాట్లాడితే శత్రుత్వముతో చంపవలెను అని కత్తి ఎత్తినవాడు సైతము సంతోషించి వదలి పెట్టుతారు. ఇటువంటి దూతలేని రాజుకు కార్యసిద్ధి గాదు'' అన్నాడు రాముడు.

''ఓ హనుమంతుడా! నీవు సజ్జనులలో సజ్జనుడవు. సుగ్రీవుడు మాతో స్నేహము చేసికోవలెను అంటున్నాడు అని నీవు చెబుతున్నావు. నీవు చెప్పినట్లు సుగ్రీవునితో స్నేహం చేస్తాము. '' అన్నాడు లక్ష్మణుడు. హనుమంతుడు కోరిన మీదట లక్ష్మణుడు రామ చరిత్రను వివరంగా చెప్పి. ''ఓ హనుమంతుడా! ఇప్పుడు ఈ రాముడు, నేను సుగ్రీవుడి శరణుగోరి ఇటు వచ్చాము. శరణాగత రక్షణ దురంధరుడు అనీ, ధర్మాత్ముడు అనీ, సర్వలోకాలలో ప్రసిద్ధి కెక్కిన ఈ రాముడు ఇప్పుడు సుగ్రీవుడికి శరణాగతుడు అవుతున్నాడు. భార్యా వియోగంతో, బాధపడుతూ దుఃఖ వివశుడు అయి ఉన్న రాముడు శరణు అడుగుతున్నాడు. సుగ్రీవుడు అనుగ్రహించవలెను'' అని కన్నీటితో జాలి పుట్టేటట్లు చెప్పాడు.

అంతట పవనాత్మజుడు ''ఓ లక్ష్మణా! సుగ్రీవుడే మిమ్ములను వెదఁకుకుంటూ రావల్సింది. అతని అదృష్టంవలన మీరే అతనికి దర్శనమిచ్చుటకు వస్తున్నారు. నేడు సుగ్రీవుడు రాజ్యభ్రష్టుడు. బలవంతుడైన వాలి అతనిని మోసం చేసాడు. అతని భార్యను అపహరించి రాజ్యం నుండి వెడల గొట్టాడు. అతనితో మేమూ సీతాదేవిని వెదకడములో సాయపడతాము'' అన్నాడు. ఆంజనేయుని మాటలలో వారికి నమ్మకం కుదిరింది. హనుమంతుడు తన నిజరూపం ధరించి రామలక్ష్మణులను తన వీపుమీద ఎక్కించుకుని సుగ్రీవుడి వద్దకు తీసుకువెళ్ళాడు.

హనుమంతుని సలహా ప్రకారం సుగ్రీవుడు అగ్నిసాక్షిగా స్నేహ బంధానికి అంగీకరించాడు. వాలిని చంపి సుగ్రీవునకు కిష్కింధా రాజ్యము అప్పగించుటకు రాముడు ప్రతిన చేశాడు. ఆ సమయాన కిష్కింధలో వాలికి, లంకా పట్టణంలోని సీతాదేవికి, రావణాసురునకు ఎడమ కన్నులు ఒకసారిగా అదిరినవి.

ధర్మ మార్గానుసారులకు, ధర్మవిదులైన బలవంతుల మైత్రి లభించి, విజయము చేకూరుననుటకు రామ - సుగ్రీవ మైత్రి ఒక తార్కాణం.

★ ★ ★ ★

36

## దైవస్తుతి

మాతా చ పార్వతీదేవీ
పితా దేవో మహేశ్వరః
బాంధవా శ్శివభక్తా శ్చ
స్వదేశో భువనత్రయమ్.

## కుమారీ !

చెప్పకు చేసిన మేలు నొ
కప్పుడయినగాని దాని హర్షింపరుగా
గొప్పలు సెప్పినదనియును
దప్పియని చిత్తమందు దలపు కుమారీ!

**భావము :** ఇతరులకు మేలు చేసినను దానిని చెప్పుకొనరాదు. అట్లు చెప్పిన పెద్దలు హర్షింపరు. గొప్పలు చెప్పుకొనుటయు తప్పే అని తెలిసికొనవలయును.

★★★★

# సక్తుప్రస్థుడు

కురుక్షేత్ర సంగ్రామం అనంతరము ధర్మరాజు పట్టాభిషిక్తుడై రాజ్యపాలనం చేస్తూ, అశ్వమేధయాగం మహావైభవంగా చేశాడు. యజ్ఞానికి వచ్చిన వారందరు ధర్మరాజును బహువిధముల ప్రస్తుతిస్తుండగా, అకస్మాకంగా ఒక ముంగిస సభలోనికి ప్రవేశించి మనుష్య భాషణములతో ''ఇది కూడా ఒక పెద్ద కార్యమేనా? పూర్వం సక్తుప్రస్థుడు అనే బ్రాహ్మణుడు చేసిన దానం ముందు ధర్మరాజు దాన ధర్మాలు ఎందుకు పనికి వస్తాయి'' అని పరిహసించింది. సభలో ఉన్న వారందరూ నివ్వెరపడి ధర్మ తనయుడికంటె ధర్మాత్ముడైన ఆ బ్రాహ్మణుడెవరో'' చెప్పమని అడిగారు.

ముంగిస సక్తుప్రస్థుని వృత్తాంతము ఈ విధంగా చెప్పింది.

''కురుక్షేత్రంలో సక్తుప్రస్థుడనే బ్రాహ్మణుడొకడు ఉంఛవృత్తితో జీవిస్తూ ఉండేవాడు. పొలంలో పడి ఉన్న గింజలను ఏరుకొని వచ్చి తను, భార్య, కోడలు, కొడుకూ భుజిస్తూ నియమజీవితం గడిపేవారు. తాము తినగా మిగిలిన వాటిని ఇంటికి వచ్చిన అతిథులకు సమర్పించేవాడు. ఇలా ఉండగా ఆ ప్రాంతంలో భయంకరమైన కరువు వచ్చింది. తిండీ, బట్టలేక ప్రజలు మలమలమాడి పోతున్నారు. చాల రోజులపాటు బ్రాహ్మణ కుటుంబం కూడా పస్తులు ఉండవలసి వచ్చింది. ఒకనాడు ఆ బ్రాహ్మణుడు గడ్డి ధాన్యం గింజలు ఏరుకొని వచ్చి పిండిచేసి నలుగురు నాలుగు భాగాలు చేసికొని తినబోతూ ఉన్నారు. ఇంతలో ఒక వృద్ధ బ్రాహ్మణుడు నకనకలాడే కడుపుతో వచ్చి ఆకలి తీర్చమని ప్రార్థించాడు., అతిథినే సాక్షాద్విష్ణువుగా భావించే వారందరు తమ పిండినంతయు ఆ బ్రాహ్మణునికి ఆహారంగా సమర్పించారు వచ్చిన బ్రాహ్మణుడు తృప్తిపడి ధర్మదేవతగా సాక్షాత్కరించి ''విప్రోత్తమా! నిన్ను పరీక్షించడానికై వచ్చిన ధర్మదేవతను నేను. నీ సర్వస్వము త్యాగము చేసి నీ దాన గరిమను అతిథి సేవాభిలాషను నిరూపించు కొంటివి. నీ త్యాగశక్తికి, దాన శీలమునకు దేవతలు సంతసించి పుష్పవర్షము కురిపించుచున్నారు. మిమ్ములను బ్రహ్మ లోకమునకు గొనిపోవుటకు రథము సిద్ధముగా ఉన్నది'' అని పలికెను.

అంతట నేను ఆ గృహస్థులు త్యాగమొనర్చిన ప్రదేశములో క్రిందపడిన పిండిపిండి వాసన చూడగానే నా శిరస్సంతయు బంగారముగా మారిపోయెను. ఆ పిండిలోని నలుసులు పడినచోట నేను అటూ ఇటూ దొర్లగా నా శరీరములో

సగభాగము సువర్ణమయమయ్యెను. మిగిలిన సగభాగమును కూడ బంగారముగా మార్చజాలు మహానుభావుడెవరా యని తలంచుచు ధర్మరాజు అశ్వమేధ యాగము చేయుచున్నాడని విని ఇచ్చటకు వచ్చాను. యాగ సమయమునందు ఇష్ట మృష్టాన్నములతో సహస్రాధిక విప్రులను సంతృప్తి పరచినాడు కదా ధర్మరాజు. వారిచేతులు కడిగినచోట పొర్లాడినచో నా దేహము సువర్ణమయముగా మారిపోవునేమో అని దొర్లుచుంటిని. వంటినిండా బురద అంటుకొనినది కాని నా దేహము మాత్రము బంగారము కాలేదు.

ఆర్యులారా! వింటిరి కదా - సక్తుప్రస్థుని త్యాగశీలము. ఇప్పుడు తామే సెలవీయండి. తినబోవు తిండిని అతిథికి ఆహారముగా నిడి బ్రహ్మలోకమునకు వెళ్ళిన సక్తుప్రస్థుడు గొప్పవాడా, లేక వివిధ రాజులను ఓడించి ధనమును సంపాదించి దాన ధర్మములు యజ్ఞయాగములు చేయుచున్న ధర్మజుడు గొప్పవాడా? అని ఆ ముంగిస ప్రశ్నించెను. సభలోని వారందరు నివ్వెరపడి మిన్నకుండిరి. ధర్మరాజుని గర్వరేఖ తొలగిపోయెను. సక్తుప్రస్థుని తపోయజ్ఞమును బహువిధముల ప్రస్తుతించిరి.

అన్ని దానములలోను అన్నదానము శ్రేష్ఠమైనది. అందునను సర్వస్వ త్యాగము శ్రేష్ఠతరమైనది.



37

## దైవస్తుతి

మాతా చ కమలాదేవీ
పితా దేవో జనార్దనః
బాంధవా విష్ణుభక్తాశ్చ
స్వదేశో భువనత్రయమ్.

### భాస్కరా!

ప్రల్లఁ దనంబుచే నెఱుకపాటొక యింతయులేక యెచ్చటన్
బల్లిదుఁడైన పత్ప్రభు నబద్ధము లాడినఁ గ్రుంగిపోదు, రె
ట్లిల్ల పభాస్థలిం గుమతులై శిశుపాలుఁడు దంతవక్త్రుడుం
గల్లలు కృష్ణునిం బలికి కాదె హతంబగుటిల్ల భాస్కరా!

భావము : గర్వాతిరేకముచే నీచులు యుక్తాయుక్త విచక్షణములేక బలవంతుడగు సత్ప్రభువును గూర్చి అసత్యవాక్యములు పలికి నశింతురు. ఎట్లనగా మహానుభావుడగు కృష్ణుని గూర్చి శిశుపాలుడును దంతవక్త్రుడును మహాసభ మధ్యమునందు నీచోక్తులు పల్కి హతమైన విషయము ప్రసిద్ధమే కదా?

★★★★

# కర్ణుడు

కర్ణుడు సూర్య వరప్రసాదమున కుంతీదేవికి సద్యోగర్భమునందు ఉద్భవించిన వాడు. అతడు సహజ కవచ కుండలధారి. మహా పరాక్రమోపేతుడు. విధి వశమున పుట్టిననాడే తల్లిచే గంగానదిలో వదలబడి రాధచే పెంచబడి రాధేయుడైనాడు. నిరంతర దానశీలుడయ్యును, మహావీరుడు అయినను - శాపదగ్ధుడై నిర్ధజీవి అయినాడు. కర్ణుని గుణ గణములలో అతి ప్రశంసనీయమైనది అతని స్వామిభక్తి.

శ్రీకృష్ణుని రాయబారము విఫలమైనది. కురుపాండవులకు యుద్ధము తప్పనిసరి అయినది. ఈ విషయ మెరిగి కుంతీదేవి, సమరమే సంభవించినచో వంశనాశము తప్పదని మిక్కిలి దుఃఖించినది. భీష్మ ద్రోణులు శిష్యవాత్సల్యముతో పాండవులను చంపక వదలిపెట్టినను తన కుమారులకు బలవద్విరోధిగా ఉన్న కర్ణుని చేతిలో ఎట్టి ప్రమాదము సంభవించునోయని తలచినది. చివరకు జన్మ రహస్యమును చెప్పి కర్ణుని యుద్ధవిముఖుని గావింపవలెనని నిశ్చయించుకొనినది.

కర్ణుడు గంగాతీరమున స్నానానుష్ఠానములు ముగించుకొని సూర్యుని గురించి జపము చేసికొనుచుండెను. పాండవుల తల్లి కుంతీదేవి కర్ణుని దగ్గరకు వెళ్ళి నిలబడెను. జపము పూర్తి కాగానే వెనుదిరిగి చూడగా మేలిముసుగుతో తన వెనుక నిలబడియున్న పాండవ మాతను గాంచి ''తల్లీ! సూతపుత్రుడై రాధేయుడు నీ కిదే నమస్కరించుచున్నాడు. ఈ సమయమున నీ విచ్చటకు ఏకాంతముగా వచ్చుటకు హేతువేమి?'' అని ప్రశ్నించినాడు.

కుంతీదేవి గద్గద కంఠముతో ''నాయనా! కర్ణా! నీవు నిజముగా సూత వంశజుడవు కావు. రాధ నీ తల్లి కాదు. సూర్యుని అనుగ్రహమువల్ల నాకు జన్మించిన వాడవు. లోకాపవాద భీతిచే కఠినాత్మురాలనై నే నానాడు గంగానదిలో విడిచి పెట్టితిని. రాధ నిన్ను పెంచినది. నీకీ విషయము తెలియక దుర్యోధనుని కొలువులో చేరి వానిని సేవించుచుంటివి. ఇప్పుడు కురుపాండవులకే యుద్ధము వచ్చినది. ఆ సమరక్షోణిలో నీవు నీ తమ్ములను వధించుటకు పూనుకొనుచున్నావు. నీవును పాండవులును కలిసి ఉండినచో సకల శత్రువులను నాశనము కావించి రాజ్యమును నిష్కంటకముగా పాలించు కొనవచ్చును. నీకు పాండవులు నిరంతరము సేవలు చేయుచుండ చక్రవర్తివగు నిన్నుచూసి సంతోషింతును. వంశనాశనము సంభవింపదు. తల్లినైన నా మాటలు విని పాండవుల పక్షములో చేరుము'' అని పలికెను.

కుంతీ దేవి వాక్యములు వినిన కర్ణుని హృదయములో సంఘర్షణ అరంభమాయెను. ఒకవైపున తల్లిపట్ల అనురాగము, మరొకవైపు ప్రభువుపట్ల భక్తి, తల్లిమాటను అంగీకరించి పాండవ పక్షమున చేరినచో లోకమంతయు తనను స్వామి ద్రోహి అని దూషించును. ఈ రెండింటిలోను దుర్యోధనుని పక్షమున నుండుటయే అతనికి ధర్మబద్ధముగా తోచెను. అంత కర్ణుడు కుంతీదేవికి నమస్కరించి ''తల్లీ! నీ కోరిక ధర్మవిరుద్ధముగా నున్నది. పుట్టిననాడే గంగలో విడువబడిన దౌర్భాగ్యుడను. అనాడే నా క్షత్రియ ధర్మము మంట గలిసినది. నా పరాక్రమమునే విశ్వసించి నన్ను ప్రాణతుల్యునిగ భావించు దుర్యధనునికి నేను ద్రోహము చేయజాలను. నీవు నీ కుమారులను చంపకుండా రక్షించమని కోరినావు కనుక అర్జునుడు తప్ప మిగిలిన వారెవరినీ నా చేజిక్కినను వధింపను. సమరములో అర్జునుడు మరణించినా నాతో నీకు ఐదుగురము కుమారుల మగుదుము. వాని చేతిలోనే నేను ప్రాణములు కోల్పోయితినా పంచపాండవులు సురక్షితముగా ఉందురు.'' అని పలికెను. కర్ణునుని స్వామిభక్తికి, ధర్మదీక్షకు మెచ్చుకొని, తన కోరిక తీరినదిగదా అని పరమానంద భరితయై కుంతీదేవి కర్ణుని గాఢముగా కౌగిలించుకొనెను.

కర్ణునిలో ఎన్ని అవగుణములున్నను వాని స్వామిభక్తి, మిత్రప్రేమ, ధృఢదీక్ష, దానశీలము మాత్రము ప్రశంస నీయములు. చేసిన మేలును మరువక ప్రాణములకు తెగించి అయినను దుర్యోధనుని పక్షముననే పోరాడిన పరాక్రమవంతుడు కర్ణుడు.



## దైవస్తుతి

ఓం నమో వేంకటేశాయ
పురుషాయ మహాత్మనే,
ప్రణత క్లేశ నాశాయ
గోవిందాయ నమో నమః.

### భాస్కరా!

కారణమైన కర్మములు కాక దిగంబడ వెన్ని గొందులం
దూఱిన నెంతవారలకుఁ; దొల్లి పరీక్షితు శాపభీతుఁడై
వారిధి నొప్పు నుప్పరిగపైఁ బదిలంబుగ డాఁగియుండినం
గ్రూరభుజంగ దంతహతిఁ గూలడె లోకులెఱుంగ, భాస్కరా!

**భావము :** విధి విధానవమువలన జరుగవలసిన కార్యములు, ఎన్ని సందుగొందులలో దూరినను, ఎంత గొప్పవారైనను తప్పించుకు పోజాలరు. పూర్వము పరీక్షిన్నృహరాజు, మునిశాపముచే తనకు మరణము సంభవించునని, సముద్ర మధ్యమునందు మేడను నిర్మించుకొని యుండినను, తుదకు పాముకాటుచే మరణింపక తప్పలేదు. అనగా విధి విధానము అనతిక్రమణీయమని భావము.

★★★★

# త్రిశంకువు

త్రిశంకువు ఇక్ష్వాకు వంశములోని రాజు. ఆయన సత్యవ్రతుడు. జితేంద్రియుడు. జగత్ప్రసిద్ధుడు. ప్రజలను కన్నబిడ్డలవలె పాలించాడు. త్రిశంకునకు తన శరీరంతో స్వర్గానికి పోవాలి - అని బుద్ధిపుట్టింది. దానికై ఏదైనా పరమ ఉత్కృష్టమైన యజ్ఞము చేయాలి అనుకున్నాడు. వెంటనే ఇక్ష్వాకువంశ పురోహితుడు. గురువు అయిన వసిష్ఠ మహర్షి వద్దకు వెళ్ళాడు. వసిష్ఠ మహర్షికి భక్తి ప్రపత్తులతో ప్రణమిల్లి తన కోరికను వెల్లడించాడు. ''రాజా! బొందితో స్వర్గము చేరుట శక్యము గాదు. ఈ ప్రయత్నాన్ని విరమించు'' అని చెప్పి మందలించాడు.

త్రిశంకువు మనసు మార్చుకోలేదు. వసిష్ఠ మహర్షి అశక్యము అని నిరాకరించినప్పటికి అతడు పట్టుదలతో సాధించ దలచాడు. గురు వాక్యాన్ని మన్నించక తపోదీప్తులతో ప్రకాశించే నూరుగురు గురుపుత్రులను దర్శించాడు. వారికి వందనము చేసి ''తపస్సంపన్నులారా! నేను ఒక మహాయజ్ఞాన్ని తలపెట్టాను. తమరు అనుగ్రహించి ఆ యజ్ఞమును నిర్వహించవలెను. తమ అనుగ్రహంతో నేను బొందితో స్వర్గానికి పోతలచాను. ఇక్ష్వాకు వంశీయులకు గురువైన వసిష్ఠులవారు కాదన్నారు. వారి తర్వాత మీరే నాకు శరణ్యం'' అని విన్నవించాడు. త్రిశంకువు చెప్పిన మాటలు వాసిష్ఠులు విన్నారు. వారికి కోపం వచ్చింది. అయినా నిగ్రహంతో ''ఓ రాజా! ఇక్ష్వాకు వంశ గురువులు వసిష్ఠ మహర్షి. ఆయన బ్రహ్మవిదుడు. యజ్ఞం చేయించడానికి ఆయనయే సమర్థుడు. నీవు, మేము, ఆయన మాటను దాటరాదు. ఆయన కాదు అన్న తర్వాత మేము యజ్ఞము ఎట్లా చేయించగలము? ఆయనను అవమానిస్తామా? ఆయన నిరాకరించిన తర్వాత నీవు మరొకరిని ఆశ్రయించుటవలన నీకు మతి పోయిందనాలి. వెంటనే నీవు ఇంటికి వెళ్ళవల్సినది'' అని చెప్పారు. వారి మందలింపులు త్రిశంకువు తలకు ఎక్కలేదు. గురువులు నన్ను తిరస్కరించారు. గురుపుత్రులు నిరాకరించారు. మీ పెద్దరికానికి ఇంతటితో స్వస్తి. నేను మరి ఒక పురోహితుణ్ణి చూచుకుంటాను'' అని ధిక్కరించాడు. పరంపరాగతము అయిన పౌరోహిత్యాన్ని మార్చివేస్తాను అనడం వాసిష్ఠులకు ఘోరంగా తోచింది. అందులోను వసిష్ఠమహర్షి అంతవాడిని తృణీకరించి అవమానించినందుకు వారు క్రుద్ధులు అయిపోయినారు. వెంటనే త్రిశంకువును ''చండాలుడవు కమ్ము'' అని శపించారు. బొందితో స్వర్గమునకు పోవడం అటుంచి చండాలత్వము అతనికి ప్రాప్తించినది. దేహం అంతా బిరుసెక్కి,

నల్లబడి తలవెంట్రుకలు కురచ పారినవి. దుస్తులు నీలిరంగు గుడ్డలుగా మారిపోయినవి. ఆభరణాలు ఇనుప సొమ్ములై పోయినవి. అందరూ అతనిని చూచి తప్పుకొని తిరుగుతున్నారు. త్రిశంకువు దుఃఖితుడైనాడు.

అమిత దుఃఖముతో విశ్వామిత్రుని దగ్గరకు పోయినాడు. తన విషాదగాథ అతనికి నివేదించాడు. విశ్వామిత్రుడు జాలిపడ్డాడు. ''మహర్షీ! నా గురువు, గురు పుత్రులు నాకు ఈ గతిపట్టించారు. నేను ఎన్నడూ అబద్ధం ఆడి ఎరగను. ధర్మమార్గాన రాజ్యపాలన చేశాను. నూరు యజ్ఞాలు ఇంకా అనేక సత్కార్యాలు చేశాను. నేను చేసినవన్నీ నిష్ఫలాలు కాబోలు. నేను దైవోపహతుడను. పురుష ప్రయత్నంతో దైవికాన్ని త్రిప్పివేయగల సమర్థులు మీరు ఒక్కరే. నేను మీ శరణు వేడుతున్నాను'' అని అంజలి ఘటించి నమస్కరించాడు త్రిశంకువు. కృపావేశంతో ''నాయనా త్రిశంకూ! నిన్ను పరమ ధార్మికుడుగా సత్యసంధుడిగా నేను ఎరుగుదును. ఈ చండాలరూపంతో నీవు స్వర్గానికి పోయేటట్లు చేస్తాను'' అని విశ్వామిత్రుడు ఓదార్చినాడు. తర్వాత శిష్యులనందరను పిలచి దేశ దేశాలకు వెళ్లి బహుశ్రుతులు ఋత్విజులు అయిన మహర్షులను యజ్ఞముకై ఆహ్వానించి రండి అని పంపాడు.

శిష్యులు తిరిగి వచ్చి వాసిష్ఠులు - ''యజ్ఞము చేసేవాడు ఛండాలుడు, చేయించేవాడు. క్షత్రియుడు ఆ యజ్ఞ హవిస్సును దేవతలు ఎట్లా స్వీకరిస్తారు? విశ్వామిత్రుని మాటవిని ఆ ఛండాలాన్నము భుజించే బ్రాహ్మణోత్తములు స్వర్గానికి ఎట్లా పోగలుగుతారు'' అన్న నిష్ఠురోక్తులు విశ్వామిత్రునకు చెప్పారు. విశ్వామిత్రుడు కోపంతో వాసిష్ఠులు భస్మమగునట్లు శపించాడు. విచ్చేసిన ధర్మజ్ఞులు విశ్వామిత్రుని తపోశక్తికి, కోపానికి భయపడి యజ్ఞము చేయించుటకు అంగీకరించారు. యజ్ఞం ప్రారంభమైనది, హవిర్భాగాలకై చాలసేపు దేవతలను ఆహ్వానించాడు. కాని వారు ఒక్కరున్నూ రాలేదు. కోపంతో విశ్వామిత్రుడు - ''ఈ యజ్ఞము నిష్ఫలమైతే కానీ, ఓ త్రిశంకూ! నిన్నిప్పుడే స్వర్గానికి పంపుతాను'' అంటూ స్రువం చేతితో పట్టుకొని ''నా స్వార్జిత తపస్సుకు ప్రభావమే ఉన్నట్లయితే ఈ త్రిశంకు మహారాజు ఇప్పుడే స్వర్గానికి పోవలెను'' అని ప్రతిజ్ఞ చేశాడు. అందరూ చూస్తూండగానే త్రిశంకువు స్వర్గానికి వెళ్ళిపోయాడు.

స్వర్గం చేరిన త్రిశంకువును చూచి ''త్రిశంకూ! నీవు గురుశాప హతుడవు. నీవు దేవలోకంలో ఉండటానికి వీలులేదు. మళ్ళీ భూమి మీద తల్లక్రిందులుగా పడిపో'' అని దేవేంద్రుడు ఆజ్ఞాపించారు. తల్లక్రిందులుగా పడిపోతూ త్రిశంకువు ''మహర్షీ! రక్షించు, రక్షించు'' అని కేకలు పెట్టాడు. విశ్వామిత్రుడు తన తపోబలంతో అతనిని ఆకాశంలో నిలిపి, రెండవ బ్రహ్మదేవుని వలె త్రిశంకువు ఉన్నచోట మరొక దేవలోకం సృష్టించడం ప్రారంభించారు. వేరే సప్త ఋషులను, నక్షత్రాలను, దేవతలను సృష్టించారు. దేవతలు భయభీతులై విశ్వామిత్రుని వద్దకు పరుగెత్తుకుని వచ్చారు. ఆయన కోపం చల్లారుస్తూ ''మహానుభావా! త్రిశంకువు గురుశాప హతుడగుట వలన స్వర్గంలోకి రాతగినవాడు కాదు'' అన్నారు. ''అయితే నా ప్రతిజ్ఞ వ్యర్థం కాకూడదు'' అన్నాడు మహర్షి. దేవతలందరూ ''మహర్షీ! మీరు సృష్టించిన నక్షత్రాలు జ్యోతిశ్చక్రానికి వెలుపల శాశ్వతంగా ప్రకాశిస్తూ ఉంటవి. గురుశాపహతుడైన త్రిశంకువు వాటి మధ్య తలక్రిందుగా దేవసమానుడుగా ప్రకాశిస్తూ ఉంటాడు'' అని పలికి విశ్వామిత్రుని స్తోత్రం చేశారు. విశ్వామిత్రుడు అందుకు అంగీకరించాడు.

గురుశాపహతుని ఎంతటి శక్తిమంతులైనా ఉద్ధరించ లేరనుటకు త్రిశంకువు చరిత్ర ఒక మేలైన ఉదాహరణ.



## దైవస్తుతి

మంగళం కోసలేంద్రాయ
మహనీయ గుణాత్మనే,
చక్రవర్తి తనూజాయ
సార్వభౌమాయ మంగళమ్.

## కుమారా !

పురుషుఁ డొనర్చని పనికిన్
అరయఁగ దైవం బదెట్లు లను కూలించున్;
సరణిగ విత్తక యున్నను
వరి పండునె ధరణిలోన వసులి కుమారా!

**భావము :** మనము ఏ పని చేయకుండగనే దైవము ఏ రీతిగా సాయపడును? పొలమును సకాలములో దున్ని చక్కబరచి విత్తనమే నాటక పోయినచో ఏ విధముగా వరి పండును? కావున మానవ ప్రయత్నము ముఖ్యమైనది. తరువాత దైవము అనుకూలించునని భావము.

★★★★

# ఉత్తరుడు

పాండవులు అజ్ఞాతవాసం చేస్తున్నారు. కీచకుని భీమసేనుడు తప్ప మరొకరు చంపజాలరని మత్స్యదేశాధిపతి అయిన విరటుని ఆస్థానంలో పాండవులుండ వచ్చునని కౌరవులు ఊహించి విరటుని గోగణాన్ని హరించేందుకు బయల్దేరారు. త్రిగర్త దేశాధీశుడైన సుశర్మ విరటునితో తన పూర్వ వైరాన్ని తలచి సైన్యంతో విరాట నగరం దక్షిణ దిశగా గోగణాన్ని పట్టుకోడానికి వెళ్ళాడు. కౌరవులు ఉత్తర గోగ్రహణానికి వెళ్ళారు. విరటుడు, కంకుభట్టు నామంతో చరించే ధర్మరాజును, వలలుడు పేరు ధరించిన భీముని, తంత్రీపాల, గ్రంధిక నామధారులైన నకుల సహదేవులతో సుశర్మను ఎదురించాడు.

అదే సమయాన దుర్యోధనుడు భీష్మ, ద్రోణ, కృప, అశ్వత్థామ, కర్ణాది వీరులతో ఉత్తర దిశగా గోసంపదను హరించారు. గోపాలకులు రాజభవనానికి పరుగెత్తి రాకుమారుడైన ఉత్తరునికి మొరపెట్టుకున్నారు. అప్పుడు అంతః పురస్త్రీ జనమధ్యలో ఉన్న ఉత్తరుడు మహోత్సాహంతో ''భయపడకండి. నన్ను చూచి అర్జునుడని భయపడేటట్లు విజృంభించి కురుసేనను చెల్లా చెదరుచేస్తాను. కాని నాకు తగిన సారథి లేడే అని విచారంగా ఉన్నది'' అని పలికాడు. అప్పుడు మాలినీ రూపంలో ఉన్న ద్రౌపది ఉత్తరునితో ''మన నర్తనశాలలో ఉత్తరకు నాట్యం నేర్పే బృహన్నల రథసారథ్యంలో సుశిక్షితుడని విన్నాం. అనేకసార్లు అర్జునునకు కూడా సారథ్యం వహించాడట. అందుకే బృహన్నలను సారథిగా తీసుకువెళ్ళు'' అంది. ఉత్తరుడు బృహన్నల పేరు చెప్పగానే పకపక నవ్వి, మరో మార్గం లేక అతని సారథ్యానికి అంగీకరించాడు. రథం కదుల్తూండగా ఉత్తర వచ్చి ''కౌర వీరుల తలపాగ కుచ్చులు నా బొమ్మ పొత్తికలకు తెచ్చిపెట్టు'' మని సోదరుని కోరగా, ఉత్తరుడు అది ఎంత పనిలే అనట్లు అంగీకరించి యుద్ధానికి వెళ్ళాడు.

రథం మహావేగంతో కౌరవసేనకు అల్లంత దూరానికి చేరింది. భీష్మ ద్రోణాది మహావీరులతో సముద్రంవలె నున్న కౌరవ సైన్యాన్ని చూచాడు ఉత్తర కుమారుడు. అతని కాళ్ళు గజగజలాడాయి. ''బృహన్నలా! రథాన్ని ఆపు. భీష్మ ద్రోణాది మహావీరులతో కూడి ఉన్న ఆ సైన్యాన్ని, చూస్తేనే నా దేహం వణికిపోతున్నది. కర్ణాది యోధులను గెలవటమే - అమ్మో! ముందు రథాన్ని వెంటనే వెనుకకు త్రిప్పు. బ్రతికివుంటే బలుసాకు తిని గడపవచ్చు'' అన్నాడు.

ఉత్తరుని మాటలు విని నవ్వుచు బృహన్నల ''రాజకుమారా! రథాన్ని మహా వీరులపైకి తోలటానికి నేనేమన్న వెఱ్ఱివాడనా? తుచ్ఛమైన సైన్యమును చుట్టుముట్టి గో ధనాన్ని వెంటబెట్టుకొని వెళ్ళుదము. అంతఃపుర కాంతామణులందరు సంతోషించునట్లు ఆ విధంగా వీరోక్తులను బల్కి ఇప్పుడు వెనుదిరిగి పోవడం న్యాయమేనా?'' అన్నాడు. ఉత్తరుడు గడగడ వణికిపోతూ ''ఉండవయ్యా! స్వామీ! ఆడవాళ్ళ సంతోషం ఎవరికి కావాలి? ముందు ప్రాణాలమీదకు వస్తే? వారితో యుద్ధ ంచేయడం మనకు సాధ్యం కాని పని'' అన్నాడు.

బృహన్నల ''చిత్తము చిక్కబట్టుకొనుము. రాకుమారా! కౌరవులు గోవులు తీసికొని వెళ్ళుతుంటే మనం వెనుదిరిగిపోవటం నలుగురిలో నవ్వుబాటుగా ఉంటుంది. సైరంధ్రి ఎంతో సంతోషంతో నీకు సారథిగా నన్ను పంపింది. పౌరులందరూ దీవెన లిచ్చారు. పరాక్రమం ప్రకటించి గోవులను తీసుకొని వెళ్ళుదము.'' అని పలుకుతూ రథాన్ని ముందుకు సాగించాడు. ఉత్తరుడు బిక్కముఖంపెట్టి తల్లడిల్లిపోతూ ''మనం వెనుదిరిగి పోతే శత్రువులు పరిహసిస్తారా? ఇంకా నయం - వారితోనా.... నేనా.....యుద్ధం చేసేది? నీకేమైనా క్రొవ్వెక్కి ఉంటే నువ్వు వెళ్ళు'' అని ధనుర్బాణాలు రథంమీద పడేసి భీతచిత్తుడై రథం దిగి పారిపోవటం ప్రారంభించాడు.

బృహన్నల అప్పుడు రథం ఆపి పరుగెత్తి అతనిని పట్టుకొని రథం ఎక్కించి ధైర్యం చెప్పసాగాడు. కాని ఉత్తర కుమారుడు భయభీతుడై పారిపోవ ప్రయత్నించాడేగాని యుద్ధ సుముఖుడు కాలేదు. అప్పుడు బృహన్నల తన నిజ రూపం తెలియజేసి శమీవృక్షము మీద నుండి గాండీవాన్ని అందుకొని కౌరవవీరులను జయించాడు.

ఉత్తరునివలె సమర సామర్థ్యము లేకపోయినప్పటికీ వీరోక్తులు పలికి, చివరకు ఎదుటివారిని చూడగానే భీతులై పారిపోవు మనుజులను చూచియే ''ఉత్తర కుమారుని ప్రజ్ఞలు'' అను నానుడి ప్రచారములోనికి వచ్చెను.



## దైవస్తుతి

వేద వేదాంత వేద్యాయ
మేఘశ్యామల మూర్తయే,
పుంసాం మోహన రూపాయ
పుణ్యశ్లోకాయ మంగళమ్.

## భాస్కరా!

వాణియు, శర్వాణియు హరి
రాణియు వాక్కునను మై నరంబున నంటల్
రాణఁ దిలకించి మదిలోఁ
బాణిగ్రాహియెడ నిల్పు భక్తి కుమారీ!

భావము : సరస్వతి బ్రహ్మదేవుని వాక్కునందును, పార్వతి శివుని సగము శరీరమందును, లక్ష్మీదేవి విష్ణుమూర్తి వక్షః స్థలమందును నిలిచియుండి, భర్తలను సేవించునట్లుగా, నీవును భర్తనే ఎల్లప్పుడును సేవించు చుండుము.

★★★★

# విదురుడు

మహామంత్రి విదురుడు విజ్ఞానఖని. ఆయన మాటలను అవజ్ఞచేసి కౌరవులు సర్వనాశనమైనారు. విదురుడు ధర్మవిధుడు. మాండవ్యముని శాపంవల్ల మానవ జన్మ పొందిన యమధర్మరాజే విదురుడు. విదుర నీతిని మనం చదివి - మళ్ళీ చదివి అర్థం చేసుకుని ఆచరిస్తే మన జీవిత పరమార్థం తెలుస్తుంది.

(అ) ఇతరుల సొమ్ము హరించినవాడికి, పరస్త్రీని కామించినవాడికి, బలవంతునితో వైరం పెంచుకున్నవాడికి మాత్రమే, రాత్రిపూట నిద్ర రాదు.

(ఆ) విద్య, వివేకం లేకపోయినా కావలసినంత గర్వం పెంచుకునేవాడు, దరిద్రుడై ఉండి ఆశలు పెంపొందించుకునేవాడు, ఏ శ్రమాపడకుండా సిరి సంపదలు వచ్చిపడాలనుకునేవాడు. స్నేహితులతో అసంబద్ధంగా చరించేవాడు, వారిని తిరస్కరించి అయోగ్యులతో తిరిగేవాడు, బలవంతులతో విరోధం తెచ్చుకోగలవాడు, శత్రువులతో స్నేహం చేసేవాడు, దోషాలను ఆచరించడానికి వెనుదియ్యనివాడు, కృతఘ్నుడూ, అకారణంగా కోపం తెచ్చుకునేవాడూ, ఈ శ్రేణికి చెందినవారి వెంట ఉండేవారు అందరూ మూర్ఖుల కోవకు చెందుతారు.

(ఇ) ఒంటరిగా భోజనం చెయ్యరాదు. అటులే ప్రయాణమూ పనికి రాదు. విషమ సమస్య ఎదురైతే ఏకాకిగా నిర్ణయాలు తీసుకోగూడదు. అందరూ నిద్రించే వేళ మనం ఒక్కరం మెలకువగా ఉండకూడదు.

(ఈ) ఓరిమి, సామర్థ్యం కలవాడికి అలంకారం, అసమర్థుడికి నైజగుణం కావాలి. శాంతిని ఖడ్గంగా ధరించిన వానిని ఎవరూ ఏమీ చేయలేరు.

(ఉ) ఈ భూమండలంలో కర్మను విడిచిన గృహస్థూ, కర్మబద్ధుడైన సన్యాసీ ఇద్దరూ అధములే. ఒక స్త్రీ వలపు వలలో పడిన పురుషుని వాంఛించే ఇతర స్త్రీకి, ఒకని సేవలో ఉన్న పురుషుని ఆదరించే వ్యక్తికి తేడాలేదు.

(ఊ) ధనవంతుడై దానాలు చెయ్యనివాడు, దరిద్రుడై క్లేశాలు సహించలేని వాడూ ఉంటే వాని మెడకొక బండరాయి గట్టి లోతయిన మడుగులో పారెయ్యాలి.

(ఋ) సమయా సమయాలు గుర్తించకుండా ఇతరుల ఇళ్ళకు వెళ్ళరాదు. రాత్రివేళల నాలుగు బాటల మధ్యలో నిర్వ్యాపారంగా నిలబడకూడదు. దయా హృదయంగల రాజుతో, వ్యభిచారియైన స్త్రీతో, పుత్రులతో, సోదరులతో, రాజోద్యోగులతో, పిల్లలుగల విధవరాలితో, సైనికులతో, అధికారం పోయిన వారితో ఇచ్చిపుచ్చుకునే వ్యాపారాలు పనికిరావు.

(ౠ) మితంగా భోజనం చేసేవారికి బలమూ, ఆరోగ్యమూ, చక్కని సంతానము చేకూరుతాయి. పాము, నిప్పు, సింహము వీటిని నిర్లక్ష్యముగా విడవడం ఎంత ప్రమాదమో స్వకులంవారిని అనాదరించడమూ అంతే.

(ఎ) స్త్రీ గృహానికి లక్ష్మి సౌభాగ్యశాలిని. ఆమె గృహానికి అలంకారము. కనుకనే వారిని సర్వదా రక్షించుకుంటూ ఉండాలి.

(ఏ) నిరంతరం ఇతరులను నిందిస్తూ, ఎదుటివారికి దుఃఖం కలిగిస్తూ, సంతోషించే వాడికంటే మూర్ఖుడు లేడు. కాముకులనూ, మంకుపట్టు పట్టేవారిని, లజ్జాహీనులనూ, పాపబుద్ధులనూ మన దగ్గరకు చేరనివ్వరాదు. ఆత్మోన్నత్యం కోరేవాడు సోదర జనాన్ని దూరం చేసుకోకూడదు. వారిని చేరదీసి వారి శ్రేయస్సుకు పాటుపడాలి.



T.T.D. Religious Publications Series No.249
Price Rs.15

జీవితం, సక్రమంగా, సుఖమయంగా, ఆనందంగా సాగాలని ప్రతి మానవుడు కోరుకోవడం సహజం. అందుకుగాను ప్రతి మనిషి కూడ క్రమబద్ధమైన నడవడికను, నీతి నియమాలను అలవరచుకోవడం ఎంతైనా అవసరం. అందువల్లే మన జీవితంలో నడచుకోవలసిన పద్ధతులను ధర్మాచరణను గూర్చి వేదాలు, ఉపనిషత్తులు సూక్ష్మంగా, సూత్ర ప్రాయంగా ఉపదేశించాయి. వాటినే పురాణాలు, ఇతిహాసాలు, చక్కని కథల్లో ఇతివృత్తాల్లో ఇంపుగా ఇమిడ్చి ఆసక్తికరంగా నీతిమార్గాల్ని ఉపదేశించాయి.

అలాంటి నీతి కథలు, గాథలు, ఈ గ్రంథంలో సరళమైన వచనంలో క్రోడీకరింపబడినాయి. ఇవి చిన్నపిల్లలు మొదలు పెద్దల వరకు అందరినీ తప్పక అలరిస్తూ, నీతితో పాటు సంప్రదాయాన్ని ఉపదేశిస్తాయి.

Printed and Published by Sri K.V.Ramanachary, I.A.S.,
Executive Officer, T.T. Devasthanams, Tirupati
and Printed at Nageswara Binding Works,Kovvur on behalf of TTD